అనేక కావ్యములు రచించుటచేత కవిరాజ బిరుదు సంపాదించి నట్టివాడును అనేక అద్భుతౌదార్య పుపనులు చేయుటచేత స్తుతింపదగినవాడును,

28 పం॥ లోకమున చేయవలసిన విధికృత్యములవల్ల మనుష్యమాత్రుడైనను లోకమున నివసించు దేవుడును మహారాజ శ్రీగుప్తుని ప్రపౌత్రుడును, మహారాజశ్రీ ఘటోత్కచుని పౌత్రుడును, మహారాజాధిరాజశ్రీ చన్ద్రగుప్తుని పుత్రుడును,

29 పం॥ లిచ్ఛవిదౌహిత్రుడును మహాదేవియైన కుమారదేవికి పుట్టినవాడును అగు మహారాజాధిరాజశ్రీ సముద్రగుప్తుని యొక్క, భూమి యంతయు జయించుటచే గల్గిన కీర్తి, ఆతడు స్వర్గస్థుడైనప్పటికిన్ని లోకమంతయు వ్యాపించి,

30 పం॥ ఆతని ఔదార్యము, విక్రమము, శాస్త్రరచన, పఠనము వీటివల్లను, మరింత విస్తరించి, అనేకమార్గముల వ్యాపించి,

31 పం॥ పశుపతి జటాజూటమునుండి వెల్లువయై పారు గంగాతోయమువలె ముల్లోకములు పరిశుద్ధము గావించెను. ఈకావ్యమును భట్టారక పాదదాసుండును, తత్సమీప మందుండుటచే గలిగిన అనుగ్రహమువలని బుద్ధిమంతుడును,

32 పం॥ ఖాద్యటపాకికుండును, మహాదండనాయక ధ్రువభూతికుమారుండును, సంధివిగ్రహిక కుమారామాత్య మహాదండనాయక ; బిరుదములుగల హరిషేణుడై యున్నది. ఇది సర్వభూతములకు హితమున్ను సుఖమున్ను, కలుగజేయుగాక:

33 పం॥ పరమభట్టారకుని పాదానుధ్యాతుండగు మహాదండనాయక తిలభట్టకుని చేత అనుష్ఠింపబడినది.

రా॥ సు॥ రా॥

---

## [4] త్రిలింగ తామ్రశాసనము.

ఈశాసనపురేకు రమారమి రెండుసంవత్సరముల క్రితం గంజాం జిల్లాలోని టెక్కలి గ్రామమునకు సమీపమున నున్న త్రిలింగ యను గ్రామమున దొరికినది. దీనిని శ్రీయుత లింగరాజ మిత్రిపండితులు సంపాదించి నాయిత్తు లగు శ్రీయుత సత్యనారాయణరాజగురువు గారి కివ్వగా వారు ఆంధ్రదేశీయేతిహాస పరిశోధకమండలి త్రైమాసిక పత్రికయందు ఆంగ్లమున దానిని ప్రకటించిరి. కొన్ని సవరణలతో దానినిందు తెనుగున ప్రకటించితిని.

ఇది దానశాసనముయొక్క ఆఖరిరేకు ఒక్కటిమాత్రమే. తక్కిన రేకులు దొరకలేదు. ఇందు దాత పేరు కాని. ధర్మము కాని పేర్కొనబడలేదు. రేకు 6 తులముల ఎత్తున్నది. నాలుగున్నర అంగుళముల పొడవున్ను, రెండు అంగుళములఎత్తును, 1/5 అంగుళము దళసరియున్ను గల్గియున్నది. రేకుముందుప్రక్క 5 పంక్తులున్ను, వెనకప్రక్క 3 పంక్తులున్ను లిఖింపబడినవి. అక్షరములు బ్రాహ్మిలిపికిచెందిన ప్రాచీనాంధ్రము. దానముప్రవర్ధమాన రాజ్యసంవత్సరము 28 వ చేయబడినది. విజయరాజ్యమనిగాని, గాంగేయశకమనిగాని చెప్పబడలేదు. అయినను దాతకళింగమునేలిన పూర్వ గాంగవంశమును స్థాపించినవాడైనను కావచ్చును, లేదా అతనితర్వాత రాజు కావచ్చును. ఈశాసనమును లిఖించినవాడు భానుచంద్రుని కొడుకగు వినయచంద్రుడు. ఈతడే హస్తివర్మ ఉర్లాంశాసనమును, ఇంద్రవర్మ అచ్యుతాపురం శాసనమును చెక్కినట్లు ఆశాసనములను బట్టి తెలియుచున్నది. ఈశాసనపులిపిగూడ ఆశాసనముల లిపులను బోలియున్నది. ఈలేఖకుడు గుణార్ణవుని కొడుకగు దేవేంద్రవర్మయొక్క గాంగేయశకము 183, 184, సంవత్సరముల శాసనములను చెక్కినట్టియు, అపూర్వ నటవంశమునకు చెందినట్టియు, మాతృచంద్రుని కొడుకగు పల్లవ చంద్రునికి సంబంధించినవాడుగా తెలియుచున్నది. ఈలేఖకుడే ఈ 28 వసంవత్సరపు త్రిలింగిశాసనము. ను, 8 సంవత్సరపు హస్తివర్మ ఉర్లాముశాసనమును, 86, 87, సంవత్సరముల ఇంద్రవర్మ శాసనములను, చెక్కినవాడగుటచేత, చాలావృద్ధాప్యమువరకుజీవించి, కళింగగాంగరాజులచేత మెప్పువడసినవాడుగా కన్పట్టుచున్నాడు. ఈలేఖకుడు చెక్కిన తర్వాతిశాసనములు పూర్వ గాంగ శకమును, పూర్వగాంగ రాజులపేర్లను తెలుపుటచేత, ప్రస్తుతపు త్రిలింగి శాసనముగూడ గాంగ శకమునకు చెందినపూర్వ గాంగరాజుదై యుండునేమో. శాసనపు లిపినిబట్టి క్రీస్తుశకము ఆరవశతాబ్దారంభమున ఇది చెక్కబడియుండును.

---



రేకు — మొదటిప్రక్క.



రేకు — రెండవప్రక్క.

### శాసనపుమూలము

రేకు — మొదటిప్రక్క.

1. దత్తంవాయత్నా ద్రక్షయుధిష్ఠిర మహీం మహిమతాం,
2. శ్రేష్ఠదానా చ్ఛ్రేయోను పాలనం షష్టింవర్ష సహస్రాణి
3. ణిస్వర్గే మోదతిభూమిదః ఆక్షేప్తా చానుమన్తా
4. చతాన్యేవనరకేవసేదితి॥ శ్రీవర్ధమానరాజ్య సంవ
5. త్సరస్య అష్టావింశతిమస్య ఫాల్గుణకృష్ణాష్టమ్యాం

రేకు — రెండవప్రక్క.

6. లిఖితముత్కీర్ణంచిదం భానుచన్ద్రస్యసూనునా
7. వినయచన్ద్రేణేతి॥

రేకు మొదటి ప్రక్కనుండు మొదటినాల్గు పంక్తులలోను, పూర్వరాజులశాసనములలో నుండు మామూలు వ్యాసశ్లోకములు వ్రాయబడినవి. దానమును రక్షించుటవలన గల్గు పుణ్యమును, పాడుచేయుటవలన గల్గు పాపఫలమున్ను వర్ణించబడినవి. నాల్గవ వాక్యాంతమందును, ఐదవ వాక్యమందును దానకాలము తెల్పబడినది. శ్రీవర్ధమాన రాజ్య సంవత్సరము ౨౮వ, ఫాల్గుణ కృష్ణాష్టమినాడు దానమివ్వబడినది.

రేకు రెండవ ప్రక్కనుండు రెండుపంక్తులలోను భాను చంద్రుని కొడుకగు వినయచంద్రునిచేత దానశాసనము వ్రాయబడి చెక్కబడినదిగా తెల్పబడినది.

మహారాజశ్రీ రాళ్లబండి సుబ్బారావుగారు
ఎం. ఏ. ఎల్. టి.

---

## (5) హస్తివర్మ ఉర్లాము శాసనము.

---

ఈ శాసనము ఎవరో 1926 వ సం- మేనెల ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికయందు ప్రకటించిరి. అందుండియే మూలమును అర్థమును గ్రహింపబడినవి. ఇటీవల డాక్టరు హల్ట్జు దొరగారు దీని నే ఎపిగ్రాపియఇండికాలో ఆంగ్లమున ప్రకటించిరి. ఈ శాసనము మూడు రాగిరేకుల మీద వ్రాయబడినది. మొదటిరేకు మొదటిప్రక్కను మాత్రము, ఏమియు వ్రాయబడలేదు. ఇందలి లిపి మిక్కిలి ప్రాచీనము. పురాతనపు ఆంధ్రలిపితో వ్రాయబడినది. భాష సంస్కృతము. గాంగవంశమును దెల్పు మొదటిశాసనమిదియె. ఇందలి లిపినిబట్టి, ఈ శాసనము నందలి ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరము 80, క్రీస్తుశకము ఆరవశతాబ్దమధ్యభాగమునకు సరిపోవునని నాయభిప్రాయము.

ఈశాసనము త్రికళింగ మను నాంధ్రరాజ్యము మహోచ్ఛదశయందున్న ప్రాచీనకాలమున ఆదేశపు చక్రవర్తులలో నొకడగు హస్తివర్మ మహారాజుచే వ్రాయింపబడినదని తెలియుచున్నది. ఈతడు గాంగ వంశజుడు.

మహారాజైన హస్తివర్మ ప్రవర్ధమాన విజయరాజ్య వత్సరములు 80 అగు కార్తిక కృష్ణాష్టమినాడీదానము చేసినట్లు మాత్రమే మనకీ శాసనము తెలుపుచున్నది.

ఈతని రాజధాని కళింగనగర మనియు, కులదేవత గోకర్ణస్వామియనియు, ఈతడు గాంగకులమును కళింగమున ప్రతిష్ఠించెననియు, ఉరామల్ల నివాసియగు జయశర్మకు ఆ గ్రామమే దానమిచ్చెననియు, శాసనమువల్ల మనకు తెలియుచున్నది.

మొదటిరేకు — రెండవప్రక్క.

## మూలము

మొదటిరేకు రెండవప్రక్క

శ్రీస్వస్తి సర్వర్త్తుక సుఖరమణీయా ద్విజయక లిఙ్గనగరా త్సకల భువన నిర్మ్మాణైక సూత్రధారస్య భగవతో గోకర్ణ్ణస్వామిన శ్చరణకమలయుగల ప్రణా మా దపగత కలికలఙ్కో వినయనయ సమ్పదా మాధారః స్వాసిధారా పరిస్పన్దాధిగత సకల కలిఙ్గాధిరాజ్యశ్చతు రుదధితరఙ్గ మేఖలా వనితలప్రథిత తతామలయశాః అనేక సమరసంక్షోభజనిత జయశబ్దో గాఙ్గామలకులప్రతిష్ఠః ప్రతాపానితమానామిత సమస్త సామన్త చూడా

రెండవరేకు—మొదటిప్రక్క

మణి ప్రభామఞ్జరీపుఞ్జరఞ్జిత చరణో మాతాపితృ పాదాను ధ్యాతః పరమ మాహేశ్వరః శ్రీమహారాజో హస్తివర్మ్మా క్రోష్టుక వర్త్తన్యాం హంద్గోలకగ్రామే సర్వ్వా సమవేతా న్కుటుమ్బిన స్సమాజ్ఞపయతి విదితమస్తు వోయథాస్మాభి అస్మి న్గ్రామే గ్రహారిక సకాశాత్క్రీ త్వా ధ్వర్ధహలశ్య భూశ్ఛేదీ కృత్వా చన్ద్రాత్కా ప్రతి ష్ట మగ్రహారఙ్కృ త్వాసర్వకరైః పరిహృత్య మాతాపిత్రో రాత్మనశ్చ పుణ్యాభి వృద్ధయే ఉరామల్ల నివాసినే వత్సస గోత్రియ వాజసనేయిన బ్రహ్మచారిణే జయ

రెండవరేకు—రెండవప్రక్క

శర్మ్మణే కార్త్తికకృష్ణాష్టమ్యా ముదకపూర్వ్వ [o] సంప్రత్తా తద్విదిత్వా స్వభూమి మనుపాల యతాం నకే నచి త్పరివాధా కార్యేతి। సీమాలిఙ్గానిచాత్ర పూర్వ్వే ణ వల్మీకస్తతః క్షేత్రపాలీ తతో ఘోషణవాప్యాః పశ్చి మపాలీ తతః పునరపి క్షేత్రపాలీ దక్షిణేన హ్యుత్తరవ న్న సీమాన్తి కాపిన పశ్చిమేన క్షేత్రపాలీ తత్తోవల్మీకః తతఃకృత్రిమా పాషాణపఙ్క్తిః ఉత్తరేణాపి క్షేత్రపాలీ తతోవల్మీకః పునర్వల్మీకః [త] తోపూర్వ్వ వల్మీకమను ప్రాప్తతి। భవిష్యద్రాజభిశ్చాయ స్థానధర్మాను పాలనీయః

మూఁడవరేకు—మొదటిప్రక్క.

తథాచ వ్యాసగీతాః—బహుభిర్వ్వ సుధాదత్తా బహుభిశ్చానుపాలితా యస్యయస్య యదాభూమి స్తస్యత స్య తదాఫలం-స్వ దత్తామ్పరదత్తాంవా యత్నాద్రక్ష యుధిష్ఠిరమహీ [o] మహిమతాంశ్రేష్ఠ దానా చ్ఛ్రేయో నుపాలనం షష్టింవర్ష సహస్రాణి స్వర్గేమోదతి భూమిదః ఆక్షేప్తా చానుమన్తాచ తాన్యేవ నరకేవసేదితి । ప్రవర్ధ మాన విజయరాజ్యసంవత్సరా అశీతీ ౧౦ కార్త్తికదిన ౭॥ ఇదం వినయచన్ద్రేణ భాను చన్ద్రస్యసూనునా శాసనం రాజ సింహస్య లిఖితం స్వముఖాజ్ఞయా॥

మూఁడవరేకు—రెండవప్రక్క

మణ్డలాగ్రగ్రనిష్పేష నిష్పిష్టా రాతిమస్తకః శ్రీమతో ప్రతిఘాజ్ఞస్య రణాభీతస్య శాసనమ్॥

---

## తెలుఁగున అర్థవివరణము.

---

శుభము. సర్వర్తు సుఖరమణీయమైన విజయ కళింగనగరమునుండి:— సకల భువన నిర్మాణైక సూత్రధారుఁడును భగవానుఁడును అగు గోకర్ణస్వామి యొక్క పాదద్వంద్వ ప్రణామము వలన నపగత మగు కలికల్మష ము గలవాఁడును, వినయ నయసంపదల కాధారుఁడును, త న అసిధారయొక్క సంచలన మాత్రముచేత వశపఱచుకొ నిన సమస్త కళింగరాజ్యము కలవాఁడును, చతుస్సముద్రిత భూమండలమునఁ బ్రసిద్ధిగాంచిన నిర్మల మగు కీర్తి కలవాఁ డును అనేక రంగములయందు జయశబ్దము నార్జించిన వాఁడును, గాంగామలకుల ప్రతిష్ఠుఁడును, ఎడతెగని ప్రతా పముచే వినమితులగు సమస్త సామంత రాజుల చూడామణి ప్రభామంజరీ పుంజములచే రంజితములగు పాదములు కల వాఁడును, మాతా పితృ పాద సేవకుఁడును, పరమ మాహే శ్వరుఁడును అగు శ్రీ హస్తివర్మ మహారాజు క్రోష్టు కవర్త్తనీ ప్రదేశమందున్న హిందోళగ్రామమునందు కూడి యున్న కుటుంబినుల నందఱను ఇట్లు ఆజ్ఞాపించుచున్నాఁడు మీకు తెలియుఁగాక, ఏమనఁగా—మాచేత నిచ్చట అ గ్రహారికుల యొద్దనుండి అధ్యర్థహాల పరిణామము గల భూ మి విక్రయించుకొనఁబడి, విభక్తమై ఆచంద్రార్క ప్రతి ష్ఠముగా నగ్రహారముగా ఏర్పాటుచేసి, ఏవిధమైన ప న్నులు లేకుండఁ జేసి మాతల్లి తండ్రుల యొక్కయు మా యొక్కయు పుణ్యాభివృద్ధికై, ఉరామల్ల నివాసియును వత్ససగోత్రుఁడును వాజసనేయ శాఖీయుఁడును అగు జయ శర్మకొఱకు కార్త్తికకృష్ణాష్టమియందు ఉదకధారాపూర్వక ముగ నీయఁబడినది ఈవిషయము నెఱింగి, స్వభూమిని

పాలించుకొను ప్రతిగ్రహీతలకు ఎవ్వరును ఏవిధమైన బా ధను చేయఁదగదు.

దాన మీయఁబడిన భూమిసరిహద్దులు ఇవి:—తూ ర్పున నొకపుట్ట, అటుపైని క్షేత్రపాళి, అటుపైని ఘోష నాపురముయొక్క పశ్చిమపాళి, అచ్చటినుండి మఱల క్షేత్ర పాళి, దక్షిణమునం దుత్తరమునందు వలెనే హద్దులు. పశ్చిమ మున క్షేత్రపాళి, అటుపైని పశ్చిమపాళి, అచ్చటినుండి మఱ ల క్షేత్రపాళి. దక్షిణమునం దుత్తరమునందు వలెనే హద్దు లు. పశ్చిమమున క్షేత్రపాళి, అటుపైని వల్మీకము, అటుపై ని కృత్రిమ మగు పాషాణపంక్తి. ఉత్తరమునందు క్షేత్రపా ళి, అటుపైని వల్మీకము, పిమ్మట మఱియొక వల్మీకము. తరువాత మొదటి వల్మీకము ఆవృత్తముగా వచ్చును. క్రమముగ ఈ దానధర్మములను ఆమోదించి పాలింపవలయు దురు. వ్యాసగీతలు కూడ ఇట్లే కలవు.

ఎట్లనగా:—అనేకులు వసుధను దానము చేసిరి ఇ ట్లే అనేకులు అనుపాలించిరి. భూమి ఏ యే కాలమునను ఎ వ్వ రెవ్వరి వశమునయుండునో అప్పుడు వారివారికి తత్ఫల ము లభ్యమగును. ధర్మజా!—స్వదత్తమును కాని, పరదత్త మును కాని, భూమిని బాధ నొందకుండ రక్షించుచుండు ము. మహానుభావులలో నుత్తముడ వగు ధర్మజా! భూమిని దాన మిచ్చుటకంటెను ఇతరు లిచ్చినదానిని ఆమోదిం చి పాలనము చేయుట యుత్తమము. ఇట్లు చేసిన దాత యును, అనుపాలకుండును అరువదివేలేండ్లు స్వర్గమునఁ గ్రీడిం పఁగలరు. ఇందులకు ఆక్షేపించువాఁడును, ఆక్షేపకుని అ నుమోదించువాఁడును అరువదివేలేండ్లు నరకమునఁ గూలియుం డెదరు. అనుక్రమముగా జరుగుచు వచ్చుచున్న విజయరా జ్య సంవత్సరములు రాం అగు నేటి కార్తిక కృష్ణ ౮ దినము నందు ఈ శాసనము భానుచంద్రసూనుఁ డగు వినయచంద్రు నిచేత రాజసింహుఁ డగు హస్తివర్మయొక్క ఆజ్ఞ ననుసరించి లిఖితమైనది. కరవాలాగ్రమునఁ జిప్పచిప్పగాఁ గొట్టఁబడిన శత్రురాజులు కలవాఁడును, శ్రీమంతుఁడును, రణాభీరుఁడు ను అగు గాంగవంశీయునిదీ శాసనము.

రా॥సు॥రా॥

—————

## [6] ఇంద్రవర్మ అచ్యుతాపురము శాసనము.

[ఈతామ్ర] శాసనము ఇండియన్ ఆంటిక్వేరీయంది దు ప్రచురింపఁబడినది. ఈఅచ్యుతాపురపు తామ్రశాసనము వలన కళింగరాజ్యాధిపుడగు నింద్రవర్మ యను రాజేంద్రుఁ డు గాంగశక వర్షములు 87 లో వరాహవర్తనియందం సిద్ధార్థకగ్రామమును గౌతమసగోత్రుఁడగు దుర్గశర్మకొ సగినట్లు తెలియుచున్నది. గాంగశకము 87 వ సంవత్స ము నాఁటి ఇంద్రవర్మయొక్క శాసనమును, గాంగశకవర్ష ములు 80 నాఁటి హస్తివర్మశాసనమును వ్రాసినవా రొ క్కరేయని “ఇదం వినయ చంద్రేణ భానుచంద్రస్య సూ సునా శాసనం రాజసింహస్య లిఖితం స్వముఖాజ్ఞాయా” యనుశ్లోకమువలనఁ దెలియుచున్నది. హస్తివర్మ తరువాతి రాజే ఈ యింద్రవర్మ యని తెలుపుటకీ 87 వ సంవత్సర పు శాసనముకంటె ప్రబలాధారములెవ్వియునవసరములేవు.

### మూలము.

మొదటిరేకు, రెండవప్రక్క.

1. ఓం స్వస్తి సర్వర్తు రమణీయా ద్విజయ కళి ఙ్గనగరాత్సకలభువన నిర్మాణైక,

2. సూత్రధారస్య భగవతో గోకర్ణస్వామిన శ్చరణ కమలయుగల ప్రణామా,

3. దపగత కలికలఙ్కో వినయనయ సంపదా మా ధారః స్వాసిధారా పరి,

4. స్పన్దాధిగత సకలకళిఙ్గాధిరాజశ్చతురుదధి తరం గమేఖలావనితా,

5. ల ప్రథితతామలయశాః అనేక సమరసంక్షోభ జనితజయశబ్దో,

6 గాఙ్గామలకుల ప్రతిష్ఠః ప్రతాపాతిశయానా మితసమస్త సామన్త,

రెండవరేకు—మొదటిప్రక్క.

7. చూడామణి ప్రభామఞ్జరీ పుఞ్జరంజిత చరణో మాతాపితృ పాదానుధ్యాతః,

8. పరమమాహేశ్వరః శ్రీమహారాజేన్ద్ర వర్మాశ వరాహవర్తన్యాం సిద్ధార్థకగ్రామే,

9. సర్వ సమవేతా న్కుటుమ్బిన స్సమాజ్ఞాపయతి విదితమస్తు వో యథాస్మిన్గ్రా

10. మే రాజతటాక పిత్రేపాలన్య భూశ్ఛదిక్పృ త్య సర్వాకరైః పరిహృ,

11. రేణా చన్ద్రార్క బిత్రిష్ఠత్వా మాతాపి తృభ్యామాత్మనశ్చ పుణ్యాభివృద్ధయే గౌత,

12. మసగోత్రాయ చ్ఛన్దోగన బ్రహ్మచారి ణేదుర్గ శర్మణే మాత్ర భట్టారికా,

రెండవరేకు—రెండవపక్క

13 పాదానా న్తటాకా ప్రతిష్టాపన ముదగయ నే ఉదక పూర్వ తేతుస్మాభి స్సంప్రదత్తా.

14 తద్విదిత్వా స్వభూమి మనుపాలయతా [న్న] కేనచిత్పరివాధా కార్యా సోమే లిఖ్గాని,

15 పూర్వేణ రాజతటాక పాళిసైదక్షిణేన వ చ్ఛిమేన పరిపాల్యా వల్మీక త్రియా,

16 ఉత్తరపాళ్యా కపాటసన్థ పరిపాషాణ స్తతః నేష్టకోన్యాః పాషాణ,

17 స్తతోర్ధి మారతరుద్వయా తతః కాకధివృక్షు శ్చేతి తటాకో దేశబద్ధ మోక్షే నతేనచి,

18. ద్విఘాతః కార్యేతి భవిష్య ద్రాజభిశ్చ య స్థాన ధర్మోక్షణుప్యాస్త ధాచ వ్యాసగీతా.

మూడవరేకు—మొదటి పక్క

19 బహుభి ర్వసుధాదత్తా బహుభిశ్చానుపాలి తా యస్యయస్య యదాభూమి స్తస్య,

20 తస్య తదాఫలం॥ షష్టింవర్ష సహస్రాణి మోద తే దివిభూమిదః ఆక్షేప్తా చాను,

21 మన్తాచ తాన్యేవ నరకేవసేత్॥ స్వదత్తాం పర దత్తాం వాయత్ని యుధిష్టిర,

22 మహీంమహిమతాం శ్రేష్టః దానా చ్ఛ్రేయో నుపాలనమితి ప్రవర్ధమాన విజయ,

23 రాజ్య సంవత్సరాః సప్తాశీతి (87) చైత్రామా వాస్యాం ఇదం వినయ చన్ద్రేణ,

24 భానుచన్ద్రస్యనూనునా శాసనం రాజసింహస్య స్వ ముఖాజ్ఞాయా॥

## అర్థము.

సర్వకాలములందును అందమూగానుండునట్టి విజయ కళింగ నగరమునుండి, సమస్తలోకములు సృజించి నడిపిం చునట్టి భగవంతుడగు గోకర్ణస్వామి పాదపద్మద్వయము ను సేవించుటచేత పోగొట్టబడిన కలికల్మషము గలవాడు ను, వినయ, నయ, సంపదల కాధారమై నట్టివాడును, తన ఖడ్గముచే సంహరించి, సంపాదించిన కళింగాధిరాజ్యము గలవాడును, నాలుగు సముద్రముల కెరటములచే చుట్ట బడిన భూప్రదేశము గల్గియుండుటచే వచ్చిన నిర్మలకీర్తి గలవాడును, అనేక యుద్ధములందు సంపాదించిన జయశబ్ద ము గలవాడును, నిర్మలమైన గాంగవంశమును ప్రతిష్టించి నవాడును, తనప్రతాపాతిశయముచేత సకలసామన్తుల మణిప్రభావసమూహములచేత ప్రకాశము నొందుచున్న పాదములు గలవాడును, తన తల్లిదండ్రుల పాదములు సేవించువాడును, పరమమాహేశ్వరుడును, అగునట్టి శ్రీమ హారాజ ఇంద్రవర్మ వరాహవర్తనివిషయములోని సిద్ధార్థక గ్రామ కుటుంబినుల నందరిని ఆజ్ఞాపించి తెలియచేయు నదేమనగా—

నాచేత ఈగ్రామము (సిద్ధార్థకము, లేక సిద్ధాం తము) సర్వ విధములైన పన్నులనుండి తప్పించబడి, సూర్య చంద్రులున్నంతవరకు అగ్రహారముగా చేయబడినది. నా తల్లిదండ్రులయొక్కయు, నాయొక్కయు పుణ్యాభివృద్ధి కై గౌతమసగోత్రుండును, చ్ఛన్దోగశాఖకు చెంది నవాడును, సబ్రహ్మచారిణియు, అగు దుర్గశర్మకు, తటాకము ప్రతిష్టించుసమయమున దానమివ్వబడి నది. ఈవిషయము తెలుసుకొని ఆభూమిని ఏవిధమైన బాధలు లేక పాలించవలెను. తర్వాత భూమి సరిహద్దులు ఇవ్వబడినవి. మూడు వ్యాసశ్లోకములు వ్రాయబడినవి. ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరము సప్తాశీతి అనగా 87 న చైత్రమాసము, అమావాస్యనాడు ఈదానమివ్వబడి నది. దీనిని భానుచంద్రుని కొడుకగు వినయచంద్రుడు రాజసింహుని ఆజ్ఞప్రకారము లిఖించెను.

రా॥సు॥రా॥

---

## 7 ఇంద్రవర్మ జిర్జింగి తామ్రశాసనము.

[ఈశాసనమును ఆంధ్రేతిహాస పరిశోధక మండలి త్రైమాసిక పత్రిక మూడవసంపుటము, మొదటి సంచికలో ప్రకటించితిని. ఇది జిర్జింగి గ్రామములో సగ్ ఆస్నోం పరశురామపాత్రోగారికి దొరకగా వారు దానిని నాకిచ్చిరి. ఇది మూడు రాగిరేకులమీద వ్రాయబడినది. అందు మొదటి,మూడవ,రేకులమీద ఒకప్రక్కనే వ్రాతగలదు. శాసనమున 26 పంక్తులున్నవి. లిపి ప్రాచీనపు తెలుగు. భాష సంస్కృతము. కడపటి వ్యాసశ్లోకములు రెండున్న తప్ప, మిగిలిన భాగమంతయు గద్యరూపమున నున్నది. శాసనపు లిపి స్వరూపమును బట్టియు, శాసనము ప్రవర్ధమాన సంవత్సరము 39 దైయుండుట చేతను, ఈదాన శాసనకర్తయగు శ్రీమహారాజ ఇంద్రవర్మ ఆరవశతాబ్ద ప్రథమచరణమున రాజ్యపరిపాలన చేసియుండును. ఈతని రాజధాని దంతపురము. ఈతడు పరమేశ్వర పాదభక్తుడు. నిర్మలమైన గాంగకులమనే ఆకాశమునకు సూర్యునివలె ప్రకాశించువాడు. అనేక [చాతుర్దంత] ఏనుగులయుద్ధములందు జయమునొందుటచే లొంగదీయబడిన సకలసామంతరాజులు గలవాడు సాధువులకు, బంధువులకు, ఆర్తజనులకు శరణునిచ్చెడివాడు. మాతా, పితృ పాదానుధ్యాత. త్రికలింగాధిపతి. ఈకడపటి బిరుదు నొందుటలో ఈతడే పూర్వగాంగరాజులలో మొదటివాడుగా గన్పట్టుచున్నాడు.]

---

మూలము.

మొదటిరేకు, రెండవప్రక్క



1 శ్రీస్వస్తి అమరపుర ప్రతిస్పర్ధి శ్రీమద్దన్తపురా ద్భగవతస్సకలభు

2. వనతలోత్పత్తిస్థితిప్రలయహేతోః పరమేశ్వ రస్య సతతప్రణా

3 మావాప్తః పుణ్యసఞ్చయప్రభావనిరస్తాశేష దురితో, గాఙ్గామలకు

4 గగనతల సహస్రరశ్మిః అనేకచాతుర్దన్త సమర విజయ

5 విమలవికోశనిస్త్రింశధారా సమాక్రాన్త సకల సామన్త

6 నృపతి మణ్డలాధిపతిః మకుట నిహిత రుచిర పద్మరాగ

7 ప్రభాప్రసేకపిఞ్జరీకృత చరణ యుగలః

---

రెండవరేకు, మొదటిప్రక్క

8 అతులబల సముదయావాప్త। విపుల విభవస మ్పల్లతా

9 మణ్డపచ్ఛాయావిశ్రాన్త సుహృత్సాధువాన్ధవార్థి జనః

10 మాతాపితృ పాదానుధ్యాతశ్శ్రీ కలిఙ్గాధిపతి శ్రీమహా

11 రాజేన్ద్ర వర్మా। పోణ్డారభోగసంబద్ధ జిజ్జి కాగ్రామే

12 సర్వ్వసమవేతాన్కుటుమ్బినః సమాజ్ఞాపయ త్యస్యాయంగ్రామో

13 స్మాభిర్విష్ణు వృద్ధసగోత్రాయ తైత్తిరీయసబ్ర హ్మచారిణే

రెండవరేకు, రెండవప్రక్క.

14 రుద్రస్వామి నూనవే అగ్నిస్వామినే తత్సూ నాయచ రుద్రస్వామినే

15 సంవిభజ్యార్థినా సముద్రాదిశశితారకార్కప్ర తిష్ఠమగ్రహారం కృత్వా

16 స్వపుణ్యాయురారోగ్యయశోభిల వర్ద్ధనార్థం మాతా పిత్రోశ్చ పుణ్యావాప్త

17 యే సర్వ్వకర పరిహారైః పరిహృత్యచాయం గ్రామః

18 ప్రత్తః తదేవం భవద్భిః పూర్వోచిత మర్యా దయోపస్థేయమ్

19 భవిష్యతశ్చ రాజ్ఞో విజ్ఞాపయామి। ధర్మాక్రమ విక్రమా

మూడవ రేకు, మొదటి ప్రక్క



20 ణామన్యతమయో గాదవాప్త భూమణ్డలాధి రాజ్యై రపిమా

21 మహీమనుశాసద్భిక్రమాగత దానమిత్యను పా లనీయమ్

22 అపిచశ్లోకా భ(గ)వతః। స్వదత్తాం పరదత్తాం వ్వా యత్నాద్రక్ష

23 యుధిష్ఠిర మహీమహిమతాం శ్రేష్ఠదానాచ్ఛ్రే యోనుపాలనం

24 షష్టింవర్ష సహస్రాణిస్వర్గెమోదతిభూమిద ఆచ్ఛే త్తాచానుమ

25 న్తాచ తాన్యేవనర కేవసేత్ ప్రవర్ధమానసం 39 వై శాఖది 21

26 లిఖితమిదం మహారాజ్ఞే సాన్ధివిగ్రహీక దేవ సిజ్ఘదేవే నేతి॥

---

అర్థము.

స్వర్గమునకు పోటీగానున్న దంతపురమునుండి, పరమేశ్వరసేవలచే లభించిన పుణ్యవిశేషము చేత, నశించిన సమస్తపాపములు గలట్టియు, గాంగవంశమనే ఆకాశమునకు సూర్యునివలె నొప్పుచున్నట్టియు, అనేకగజయుద్ధములందు విజితులైన సామంతరాజుల కిరీటములయందలి పద్మరాగ మాణిక్యముల కాంతులచే భాసిల్లుపాదములు గలట్టియు, తనమహాసంపద యనెడి తీగల చవిక క్రిందవిశ్రమించిన మిత్రబాంధవ సాధుపీడిత జనులుగలట్టియు, తల్లిదండ్రులయెడ భక్తిసంపన్నుడైనట్టియు, త్రిలింగరాజ్యము నేలినట్టియు, శ్రీమహారాజేన్ద్రవర్మ వోఖ్జారభోగమునకు సంబంధించిన జిజ్జికా గ్రామమందలి సకలకుటుంబినులను సమకూర్చి ఆ గ్రామమును విష్ణువృద్ధసగోత్రుండును, తైత్తిరీయ సబ్రహ్మచారిణియు, అగు రుద్రస్వామి కుమారుడు అగ్నిస్వామికిని అతనికుమారుడైన రుద్రస్వామికిని ఎట్టిపన్నులులేకుండగా శాశ్వతాగ్రహారముగా తనచేత దానమివ్వబడి నట్లు తెలియజేసి "మీరందరును ఈదానము నెడ పూర్వోచిత మర్యాదతో ప్రవర్తింపదగు"నని శాసించి, రాబోవు రాజులీకులక్రమాగతమైన దానమును చక్కగా పరిపాలింపవలసినదని విధించెను. తర్వాత రెండువ్యాసశ్లోకములు లిఖింపబడెను. ప్రవర్ధమానసంవత్సరము 39 వైశాఖ ది 21 న మహారాజాజ్ఞానుసారముగా సంధివిగ్రహీక దేవసింఘుదేవునిచే లిఖింపబడినది.

మహారాజశ్రీ రాళ్ళబండి సుబ్బారావుగారు
ఎం ఎ., ఎల్. టి.,

---

## 8 గుణార్ణవుని కుమారుడైన ఇంద్రవర్మ పుర్లి తామ్రశాసనము.

---

విశాఖపట్నము జిల్లాలో పాలకొండకు మూడుమైళ్లదూరమున నాగావళీనదికి దక్షిణపుటొడ్డున పుర్లి అను పల్లిటిగ్రామమున్నది. అచ్చట ఒక గృహస్థుని వద్ద ఈపతాకున్నది. ఈశాసనము మూడు రాగి రేకుల పైన వ్రాయబడియున్నది మొదటి రేకుకు, మూడవరేకుకు లోపటి ప్రక్కలయందును, మధ్యరేకుకు రెండు ప్రక్కలయందును వ్రాతయున్నది.

వ్రాతలో వర్ణక్రమ భేదములు కొన్ని యున్నవి. గాని మొత్తముపైన భాషమాత్రము శుద్ధసంస్కృతము. సంస్కృతిముగాని పదము ఒక్క 'తిరిలింగ' మే.

ఈపతాను ఇచ్చినవారు సకల కళింగాధిపతులైన ఇంద్రవర్మ మహారాజుగారు. మీరు ప్రతాపశాలి అయిన గుణార్ణవుని కొమార్డు. గంగవంశములో మణిపూస. మహేంద్రగిరి పైనున్న గోకర్ణస్వామివారి భక్తులు. తల్లిదండ్రుల పాదములనే ధ్యానము చేయువారు.

తిరిలింగ కాపురస్తుడు, ఋగ్వేద రాజీయుడు, కౌశికస గోత్రికుడు, వేదవేదాంగ పారంగతుడు అయిన భవదత్త శర్మ అనే బ్రాహ్మణునికి భూదానము చేసిరి. కూరక రాష్ట్రములోనున్న భుక్కుకుర గ్రామములో ఒక భూమి ఉదకపూర్వకముగా దత్తము చేయబడినది. కార్తిక శు 15 న దానమివ్వబడ్డది. పతా ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరములు 149 పుష్య ది 20 వ్రాయబడ్డది.

ఇక ఈశాసనములో పక్కాణించియున్న స్థలములు:—

రాజుగారు దంతపురం మకాంలో ఉండగా ఈశాసనము ఇవ్వబడ్డది. శ్రీకాకుళమునకు సుమారు 12 మైళ్ళు పశ్చిమమున నాగావళీనదికి దక్షిణముగా ఒక పెద్ద పాడుబైలు ఉన్నది. అచ్చట దంతపుర్తిని కోట పూర్వము ఉండేదని చెప్పుదురు. ఈబైలు నంటే పశ్చిమమున సిద్ధాంతమనే గ్రామమున్ను, దానికి పశ్చిమముగా వారమండలమనే గ్రామమున్ను ఉన్నవి.

ఈశాసనము మొదట మసోయిదా హస్త్యధ్యక్షుడయిన ధర్మచంద్రుని కుమారుడయినట్టిన్ని సర్వాధికారి అయినట్టిన్ని సాంబ పురోహాధ్యాయునిచే వ్రాయబడ్డది. మహామహత్తర శివశర్మగారు ఈమసోయిదాను అంగీకరించిరి. తర్వాత ఆదిత్య భోగియొక్క కొమారుడయిన ఖండిచంద్రునివల్ల యీరేకులపై చెక్కబడ్డది.

---

## మూలము.

### మొదటి రేకు, రెండవప్రక్క.

1 ఓంస్వస్తి విజయవతో దంతపుర వాసకాన్మహేంద్రాచల! శిఖరప్రతిష్ఠి

2 తస్య చరాచరగురో స్సకలభువన నిర్మాణైక సూత్రధారస్య భగవతో గో—

3 కర్ణస్వామి నశ్చరణ కమలయుగల ప్రణామాద్విగతకలికల ఙ్కో—గా—

4 జ్ఞామలకుల తిలకస్స్వాసి ధారాపరి స్పందాధి గత సకల కళింగాధి—

5 రాజ్య ప్రవితత చతురు దధిసలిల తరఙ్గమేఖలా వనితలామ—

6 లయశాః అనేకసమర సంఘట్ట విజయ జనిత జయశబ్దప్రతాసోపన—

7 తసమస్త సామన్త చూడామణి ప్రభా మఞ్జరీపుఞ్జరఞ్జితచరణోమాతా—

8 పిత్రుపాదానుధ్యాతః శ్రీమద్గానార్ణవసూనుః శ్రీమన్మహారాజేంద్రవ—

### రెండవ రేకు—మొదటిప్రక్క.

9 ర్మా కూరకరాష్ట్రే భుకుకురచ్ఛేద కర్షకాన్కుటు మ్బినస్స మాజ్ఞాపయతివి—

10 దితమస్తు వోయదాయం ; ఛేదస్సర్వ కరభరైపరిహృత్యా చంద్రార్కకా ప్రతిష్టం కృ—

11 త్వామాతా పిత్రోరాత్మ నశ్చ పుణ్యాభి వృద్ధయే, కార్తీక పౌర్ణమాస్యాం సలిలపూ [ర్వక]

12 కం కౌశిక సగోత్రాయ [బ] హ్వృచసబ్రహ్మచారి
ణే శ్రీలింగవా స్త—

13 న్యాయ వేదవేదాంగ పారంగాయ భవదత్త శర్మణ
స్సంప్రత్త స్సదేవం—

14 వివిత్వాయధోచి (తభో) గభాగా ముపనయంత
[1] సుఖం ప్రతివసతేతి సీమా—

15 లిఙ్గాని చాత్ర ప్రదక్షిణక్ర మేణ భోద్ధవ్యానిపూర్వేణ
వల్మీకా దారభ్య పురుష—

16 చ్ఛాయ యార్జున వృక్షస్తతో వల్మీక స్తతో
వల్మీకసహితజక్కరజవృక్షఃపక్షి—

రెండవ రేకు— రెండవ ప్రక్క.

17 ణేన కరజవృక్షా త్ప్రభృతి పురుష చ్ఛాయయా
పాషాణాస్త్రయః పశ్చిమే—

18 నపాషాణాత్ ప్రభృతి పు [రు] షచ్ఛాయయా
పాషాణ ఏవతతో ర్జున వృక్ష స్తత—

19 స్సాషాణః ఉత్తరేణ పాషాణా త్ప్రభృతి పురుష
చ్ఛాయయా తినిరవృ—

20 క్షస్తత స్సాపాణ స్త తిజ్కపాట సంధి క్రమేణ
పాషాణ స్తత—

21 స్సాషాణ ఏవ తతోవల్మీక ఇతి భవిష్యతశ్చ
రాజ్ఞప్రజ్ఞా—

22 పయతి ధర్మ క్రమ విక్రమాణా మన్యతమయో
గాదవాప్యమహీం—

23 మను శాసద్భిర మన్దానధర్మోనుపాలనీయో (యః)
వ్యాసగీతాశ్చాత్రశ్లో—

24 కాః బహుభిర్వ సుధాదత్తా బహుభిశ్చానుపా
లితా యస్యయస్య.

మూడవ రేకు, మొదటిప్రక్క.

25 యదాభూమి స్తస్య తస్య తదాఫలమ్ స్వద
త్తాం పరదత్తాం వాయోత్నాద్రక్ష—

26 యుధిష్ఠిర, మహీమ్మహీమతాం శ్రేష్ఠదానా చ్ఛే
యోనుపాలనమ్ షష్టి—

27 వర్షసహస్రాణి స్వర్గే తిష్ఠతి భూమిదః ఆక్షే
ప్తాచానుమన్తా చతాన్యేవ—

28 నరకే వసేదితి ఆజ్ఞాపమహామహత్తర శివశర్మ

ప్రవర్ధమాన—

29 విజయరాజ్య సంవత్సరాః 100 40 6 [146] పుష్య
ది 20 విదిత మిదంశాస—

30 నం వ స్త్య ధ్యక్ష ధర్మ సూనునా సర్వాధ
భిక్స తేన శామ్బపుకోపాధ్యాయే—

నోత్కీర్ణ మాదిత్య భోగిక తనయేన ఖణ్డిచన్ద్రేణేతి.

తెనుగు అర్థము.

ఓం స్వస్తి-విజయ స్థానమైన దంతపురమునుండి, సచరాచర ప్రపంచక నిర్మాణమునకు కేవలమూ సూత్రధారుడైనట్టిన్ని, మహేంద్రగిరిపై నధిష్టించినట్టిన్ని గోకర్ణస్వామియొక్క పాదపద్మయుగళమునకు నమస్కరించుటచే పోయిన కలిపాపము గలిగినట్టిన్ని, నిర్మలమైన గంగకుల తిలకుడైనట్టిన్ని, తన స్వంతఖడ్గధారయొక్క తళుకుచే జయించబడిన సమస్త కళింగరాజ్యమునూ పాలన జేయుచున్నట్టిన్ని, నాలుగు ఉదధులయొక్క తరంగములే మొల త్రాడుగాగల సమస్తభూమండలములోనూ నిష్కలంకమైన కీర్తిని బడసినట్టిన్నీ, అనేకమైనయుద్ధరంగములయందు గలిగిన జయభేరియొక్క ఆడంబరముచే నమితులుగా చేయబడిన సమస్తరాజులయొక్క శిరస్సులపైనున్న కిరీటముల యందమర్చబడిన మణులయొక్క కాంతులు పడుటచే పూలగుత్తులు వేసినట్లు రాణించుచున్న పాదములు గలిగినట్టిన్ని, మాతాపితృల పాదములనే నమ్మినట్టిన్ని, ప్రతాపవంతుడైన గుణార్ణవుని కొమారుడైన ఇంద్రవర్మ మహారాజు, కూరకరాష్ట్రములోయున్న భుక్కుకుర గ్రామపు వ్యవసాయగాండ్రకు ఇచ్చిన తాఖీదు:—

ఈభూమికి సరిహద్దులు ప్రదక్షిణ రీతిగా చెప్పబడెను. ఇచ్చట దానభూమి సరిహద్దు లివ్వబడినవి.

ఇకముందు పాలనజేయు రాజులకు ఇట్లు విజ్ఞాపించుచున్నాడను. పాక్కుచేగాని, వారసత్వముచే గాని, జయించికాని లేక మరియేవిధముచే తనైననూ మీరు ఈరాజ్యము పరిపాలించినప్పుడు ఈపుణ్యదానమును జరుపవలెను ..

ఇందు విషయమై వ్యాసుడు చెప్పిన శ్లోకములుగలవు.

ఇచ్చట మూడుశ్లోకములు చెప్పబడియె.

మహామహత్తర శివశర్మగారి ఆజ్ఞనుపొంది ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సర 146 పుష్య 20 దిన మందు-
ఏనుగుల యజమాని అయిన ధర్మచంద్రుని కుమారుడు

సర్వాధికారి సాంబపురోహితాధ్యాయునిచే కూర్చబడినది. ఆదిత్యభోగిక కొమారుడయిన ఖండిచంద్రునివల్ల చెక్కబడ్డది.

———

## 9 కుబ్జవిష్ణువర్ధనుని చీపురుపల్లి తామ్రశాసనము.

(శారద ప్రథమసంపుటమునుండి)

మహారాజశ్రీ గో॥ రామదాసుగారు, బి ఎ

[ఈశాసనము ప్రతిబింబములతో సహా ఇండియన్ ఆంటిక్వరీ 20 సంపుటమందు ప్రకటింపబడినది. ఇది విశాఖపట్టణం జిల్లాలోని చీపురిపల్లికి సమీపమున కనుగొనబడినది. ఈశాసనము మూడు రాగిరేకుల (7''×2'') మీదను వ్రాయబడినది. శాసనపు లిపి ప్రాచీన తెల్గు-కన్నడము. భాష సంస్కృతము. శాసనవిషయ మేనగా, విషమసిద్ధి యను బిరుదునొందిన కుబ్జవిష్ణువర్ధనుఁడు పూడి (టి) విషయములోని చెరుపుర గ్రామమున నివసించుచు ఈదాన పట్టాయొసంగెను. సర్వసిద్ధి తాలూకాలోని దిమిలివిషయములోని కల్వగొండ గ్రామమును ఇద్దరు బ్రాహ్మణుల కొసంగెను. ఈదానము తన 18 రాజ్యకాలమున చంద్రగ్రహణ సమయమున నిచ్చెను. అనగా క్రీ॥శ 632 సంవత్సరం శ్రావణమాసములో ఇచ్చెను దీనిని బట్టి దక్షిణకళింగము క్రీ॥ శ॥ ఏడవశతాబ్దారంభమున తూర్పు చాళుక్యుల స్వాధీనమున నుండెనని స్పష్టము.

### మూలము

———

#### మొదటిరేకు-రెండవప్రక్క.

1 స్వస్తిః శ్రీమచ్చళుక్యకుల జలనిధి సముదితో నృపతి నిశాకరః స్వ।

2 భ్రూలతాభంగా నీమితరిపు నృపతి మకుటమణి ప్రభావిస్ఫురిత చరణారవింద।

3 ద్వయః సత్యాశ్రయ శ్రీవల్లభమహారాజః తస్యప్రియానుజః స్తుజల।

4 వనగిరి విషమదుర్గేషు లబ్ధసిద్ధిత్వాద్ విషమసిద్ధిః దీనానాథ ద్విజవసువృష్టి।

5 ప్రవర్షనట యాకామధేనుః యువతిషు మదనాయమాన చారుశరీరత్వాత్ మకరధ్వజ।

#### రెంవడరేకు—మొదటిప్రక్క.

6 స్వదార్ణవేషు పరిమగ్నకలిప్రభావః అనేకసమర విజయసముదిత।

7 విమల యశోవిశేష విభూషిత సకలదిఙ్మండలః మనూరివ వినయజ్ఞః ప్రిథు।

8 రివప్రిథుకీర్తిః గురూరివమతిమాన్ పరమబ్రహ్మణ్యః శ్రీవిష్ణువర్ధన మహారాజః

9 దిమిల విషయే కల్వకొండ గ్రామాధి వాసినః కటుంబి నస్సమవేతాన్ ఇమాం అర్ధం ఆ।

10 జ్ఞాపయతి యథా అధీతావగత వేదవేదాంగస్య బ్రహ్మశర్మాణః పౌత్రాభ్యాం అధి।

#### రెండవరేకు—రెండవప్రక్క.

11 గతస్వశాఖా ధ్యోడిత స్వకర్మానుష్ఠాన తత్పరస్య దుర్గశర్మణః పుత్రాభ్యాం వేదవే।

12 దాంగేతిహాసపురాణ ధర్మశాస్త్రాధ్య నేకాగమ తత్వవిధ్యాం గౌతమ గోత్రాభ్యాం।

13 తైత్తిరిక చరణాభ్యాం విష్ణుశర్మ మాధవశర్మభ్యాం పుకి విషయే చెఱుపూర।

14 గ్రామాం అధివాసతః శ్రావణమాసీ చంద్రగ్రహణ నిమిత్తే సర్వకర పరిహారే।

15 ణ। అగ్రహారీ కృత్య స్వపుణ్యాయురారోగ్య యశోభివృద్ధయే గ్రామోయాందత్తః అస్య।

#### మూడవరేకు-మొదటిప్రక్క

16 కశ్చిద్ అపినబాధా కరణీయ అతిప్రావగీతా బహుభిర్ వసుధాదత్తా బహు।

17 భిశ్చానుపాలితా యస్యయస్యయదాభూమి స్తస్యతస్యతదాఫలమ్

18 షష్టివర్షసహస్రాణిస్వర్గేమోదతిభూమిదః ఆచ్ఛేత్తాచానుమన్తాచ తాన్యేవ నరకే

19 వసేత్ శ్రీమతి మత్స్య కులే ప్రసూతాః స్వభుజబల ప్రతాపావనతరిపు।

20 ర ఆజ్ఞప్తిర్ ఆటవిదుర్జయః సం 10 8, మా-4, ది 10 5.

## 10 శ్రీమాన్ నన్దవర్మ శాంతబొమ్మాళి తామ్రశాసనము.

[ఈశాసనము, తెనుగున విభవ సంవత్సర ఆషాఢ మాస భారతియందు శ్రీలక్ష్మీనారాయణ హరిచందన జగద్దేవుగారును, మార్గశీర్షమాస భారతియందు నేనును, ఆంధ్ర దేశీయేతిహాస పరిశోధకమండలివారి ఇంగ్లీషు త్రైమాసికపత్రిక, రెండవసంపుటము, మూడు నాల్గుసంచికలలో సత్యనారాయణ రాజగురువుగారును, ప్రకటించడమైనది. ఇది మూడు రాగిరేకులమీద వ్రాయబడినది. అందు మొదటిరేకు మొదటిప్రక్కను, మూడవరేకు రెండవప్రక్కను ఏమియులేదు. ఒక రాగి కడియమునందు రేకులమర్చబడినవి. కడియపు ముద్రమీద వృషభము, చంద్రుడు మొదలగు విగ్రహములు చెక్కబడినవి. ఈశాసనపు లిపి ప్రాచీన దేవనాగరి. భాష సంస్కృతము. చిట్టచివరనున్న రెండు వ్యాసగీతములు తప్ప, మిగిలిన శాసనమంతయు గద్యరూపమున నున్నది. శాసనకాలము ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరములు 221, ఆషాఢ పంచమి దినము.

ఈశాసనము పూర్వగాంగవంశజుడగు, శ్రీ అనంతవర్మకుమారుడును అగు శ్రీమన్నన్దవర్మ మహారాజుదైయున్నది. పూర్వగాంగవంశపు రాజుల వివరము లన్నియు ఇందుకూడ గలవు. ఈరాజు తనపరిపాలనము నందున్న "ఛిఖల్లిక" గ్రామనివాసులగు భోగిక (ఆదాయపుపన్ను వసూలుచేసేవారు) వారికి (నీటితీరువా వసూలుచేసేవారు) ప్రముఖులకందరిని సమకూర్చి కుటుంబినులను [వ్యవసాయదారులను] ఆజ్ఞాపించుట ఏమనగా—"మీకు తెలియబడుగాక! శ్రీమన్నన్దవర్మనైన మేము ఈ ఛిఖల్లిక [గ్రామము]ను సూర్యగ్రహణకాలమందు [మా] పుణ్యాభివృద్ధికొరకు రాజపుత్రుడైన 'ఖాలి' అను పేరుగలవాని [సమక్షమున] 'భూపత్తక', నివేశనసహితముగను, కౌండిన్యసగోత్రులున్ను, బ్రాహ్మణులున్ను అగు ఆదిత్యశర్మ, మాతృశర్మ, దుగ్గశర్మలకు సర్వవిధములైన పన్నులు, ఇతర ఆటంకములు తప్పించి ఆచంద్రార్కస్థాయిగా ఇవ్వబడినది.]

---



మూలము.

మొదటి రేకు, రెండవ ప్రక్క

1 ఓంస్వస్త్యమరపురానుకారిణః సర్వర్త్తుసుఖరమణీయా
2 ద్విజయవతః శ్రీకలిఙ్గనగరాద్వాసకాన్మహేన్ద్రాచలా
3 మలశిఖరప్రతిష్ఠితస్య చరాచరగురోస్సకల
4 భువననిర్మాణైకసూత్రధారస్యశశాఙ్కచూడా
5 మణేర్భగవతో గోకర్ణస్వామినశ్చరణకమ
6 లయుగలప్రణామాదపాస్తసకలకలికలఙ్కో
7 గఙ్గామలకులోద్భవనిజనిస్త్రింశధారోపార్జితసక
8 లకలిఙ్గాధిరాజ్యః ప్రవితతచతురుదధితరఙ్గమేఖ



రెండవరేకు, మొదటిప్రక్క

లావనితలామలకుశాఆనేకసంఙ్ఖ్యోభజని
10 తజయశబ్దః ప్రశాపావనత్సమస్తసామన్తచక్ర
11 చూడామణి ప్రభామఞ్జరఞ్జితచరణపర
12 మమహేశ్వరోమాతాపితృపాదానుధ్యాతోనయవి
13 నయదయదాక్షిణ్యశౌర్యౌదార్యసత్యత్యాగా
14 ద్విగుణసంపదామాధార శ్రీ ఆనన్తవర్మనూనుమహారా
15 జశ్రీమానన్దవర్మాఘరేయభుక్తౌ పాతిచిఖల్లిశాగ్రా
16 మవాసినో భోగికవారికప్రముఖనస్వసమవేతాం



రెండవరేకు, రెండవప్రక్క.

17 కుమ్బినసమాజ్ఞాపయతి ఃదితమస్తువోయథాస్మిన్ గ్రా
18 మేస్మాభిః శ్రీమానన్దశమ్మాణానూర్యోప రాగేపుణ్యాభివృ
19 ద్ధయే రాజపుత్రఖాలినామాభూపటకః నివేశ
20 నసహితా కపిలమణ్డపయమ లేపోల్లకఃత
21 కౌన్డిన్యసగోత్రాయబ్రాహ్మణాదిత్యశర్మణే మాత్రి
22 శర్మణే దుగ్గశర్మణేచ సర్వకరభరైః వరిహృత్యా
23 చన్ద్రార్కప్రతిష్ఠప్రతిపాదిత ఇతిపూర్వేణదోల్లంగినామ
24 గ్రామసీమానేతు దక్షిణేనప్రవహతి దక్షిణేనసీమా



మూడవరేకు, మొదటిప్రక్క

మూ ల ము.

25 సేతుపశ్చిమదక్షిణకోణే పాషాణః పశ్చిమేణ వాపీ
26 ఉత్తరపశ్చిమకోణే పాషాణఉత్తరేణ కాణగర్తాపు
27 ర్వేణ గ్రవహాతి రాజ్ఞః ప్రజ్ఞాపయతి మాభూద
28 ఫలశఙ్కా వః పరదత్తేతి పార్థివాస్వదానాఫల
29 మాతన్త్య పరదానానుపాలనం బహుభిర్వసుధాద
దత్తా రాజా
30 భి సగరాధిభిర్యస్యయస్య యదా భూమి తస్యతస్య
31 తదాఫలమితి ప్రవర్ధమానవిజయరాజ్యసంవచ్ఛరశతే
32 ఆసాఢదినపఞ్చమి ఉత్కీర్ణశాసన

---

## 11 దేవేంద్రవర్మ చీడివలస శాసనము.

---

బ్రహ్మశ్రీ విద్వాన్ కట్టి సాంబమూర్తి శాస్త్రిగారు.

ఈ తామ్రశాసనము గంజాము జిల్లా నరసన్నపేటకు 8 మైళ్ళ దూరమున నున్న చీకివలస యను నొక పల్లెటూరు నందొక రైతునకుఁ బాటిమట్టి త్రవ్వుచుండగా దొఁరికినది. ఈశాసనమున మూడు రాగి రేకులు గలవు. అందు మొదటి రేకు మొదటిప్రక్కను ఏమియు వ్రాయఁబడలేదు. అం దొక శంఖము మాత్రము చెక్కఁబడినది. మూడవ రేకు రెండవప్రక్కను మూఁడుపంక్తులలో శాసనవిషయమును, దానిక్రింద నంగుళము దూరమున నొకపూవు రెండు మొగ్గలు [ఆకులు] గల తామరతీగయును లిఖింపఁబడినవి. ఒక్కొక్క రేకుపొడవు 8 అంగుళములు, వెడల్పు 3 న్నర అంగుళములు, దళసరి 1/5 అంగుళము. ఈమూడు రేకులకు నెడమభాగమున నంచునకు 9/10 అంగుళము దూరమున 3/5 అంగుళము వ్యాసముగల రంధ్రములు గలవు. ఆరంధ్రములలో నుండి 1, 7/10 చుట్టుకొలతి, 12 అంగుళముల పొడుగుగల రాగికడియము దూర్పఁబడి దాని రెండుకొనలును రాజముద్రిక ద్రికగల యొకదిమ్మలో సంధింపఁబడినవి. రాజముద్రిక గల దిమ్మ గుండ్రముగా 2, 1/4 అంగుళముల పరిమాణము గలది. సుమారు 3/4 అంగుళముల దళసరి గలది. ముద్రిక యం దడుగున నొకసనాళకమలము, దానిపై నొకపీఠము, దానిపైఁ బండుకొనియున్న నందివిగ్రహమును, దానిపైని ప్రాచీనదేవనాగరిలిపిలో శ్రీదేవేంద్రవర్మ యను రాజనామమును, దానిపైని చంద్రికళయును, బోఁతపోయఁబడినవి. శాసనమందలిభాష సంస్కృతము. గ్రామనామములు మాత్రము తెలుగుభాషాత్మకములే. ఇం దనిమిది అను

ష్టుప్ శ్లోకములు నొక యింద్రవజ్రావృత్తము నొకవియోగినీవృత్తమా నున్నవి. మిగిలినదిగద్యగానున్నది. శాసనగ్రంధమును రచించినవా రెవరో తెలియరాలేదు. "ముధపేవ లిఖితం" అని కలదు. ఆముధపయేరచయితయైయుండు నేమో యూహింపవలసియున్నది

గాంగావంశమున కలంకారమైన భూపేంద్రవర్మ కుమారుడగు దేవేంద్రవర్మ గాంగేయప్రవర్ధమానవిజయ రాజ్యసంవత్సరములు మూడునందల తొంబదియేడవయేట సూర్యగ్రహణనిమిత్తమున కోలువర్తనియందలి కందలివాడగ్రామవాస్తవ్యులగు అదిత్యభట్ట యజుభట్ట ప్రముఖులకు సిపిడిపద్రేశమును సర్వకరపరిహారముగా దానము చేసెను. ఈశాసనము నందితని వంశావళి విస్తారముగా వర్ణింపబడలేదు. ప్రతిగ్రహీతలభారద్వాజగోత్రము

———



మొదటి రేకు, రెండవ ప్రక్క

శాసనమూలము.

1 ఓంస్వస్తి శ్రీమదనేక దేవకులా కులా చమర పురానుకారిణ కల్పాన్తసజ్కల్పితాన

2 ల్పనసమ్రాజ్యమోహితమహాసుహిమ్నా మతల తిలకాత్ కలింగ

3 నగరాత్ ప్రసిద్ధసిద్ధతాపసాధ్యాశితకన్దగోచర మహేన్ద్రగిరిశిఖర

4 శేఖరస్య సురాసురగురో స్సకలత్రిభువనమహా సాననిర్మాణైక

5 సూత్రధారస్య భగవతో గోకర్ణస్వామి నశ్చ రణకమలసం

6 భవసలిలక్షాళితకలికాలకలంకో గంగామలకుల చూడా.

7 మణి (ః) ప్పూర్జం నిజభుజ ప్రజ [ప్రభా] జితస కలకలింగాధిరాజ్య (ః) మందాని

8 లవేలాకులకల్లోల జలధిమేఖలావని తలామలయ శో ఽనేకభీష

9 ణసమరసంఘట్టగజఃతజఃసుప్రతాపావనతసమస్త సామంత

రెండవరేకు, మొదటిప్రక్క

10 కిరీటకిరమణమంజరీపుఞ్జరఞ్జితచరణః పరమ మహేశ్వరో మాతా

11 పితృపాదానుధ్యాతో మహారాజాధిరాజపరమే శ్వర శ్రీమత్ భూపేంద్రదేవవర్మణః సూ

12 నుః శ్రీదేవేన్ద్రవర్మణః స్వాసిధారావినిర్జి [త] సకలారాతిమణ్డలః యో రక్షతి

13 క్షితిం ధీరః క్షితిశోనాన్యశాసనాత్ పారిప్ల వేలాతతి యస్యకీర్త్యా ఘనఘోషే

14 వనిర్మలా (ః) అన్యోన్యం వారయంతీవ వీచయ శ్చమహోదధేః యస్మి న్నమమతీం

15 పాతి స్తే యశబ్దోనిరర్థకః [ః] పరదారవ్యాప పహరణ విరహః (ః) పరిత్యయాతభుత్ మార

16 సింహః [ః] పితా యస్య వజ్రీ చైవ పితామహః స్వయం దేవేన్ద్రవర్మేతి సూతి సద్గుణకీర్తనంసహ

17 కోలువర్త న్యాం కన్దలివాడగ్రామనివాసికుటు మ్బిన [ః] సమవేతానాజ్ఞాపయతి యథా

18 యం ధర్మేణ మాతాపిత్రో రాత్మనశ్చ పు ణ్యాభివృద్ధయే మయా ఇజ్యాధ్యయన కృయార

19 తేభ్య [ః] తే కే సిసిశ్రిగామవాస్తవ్యాః వేద వేదాంగావేదిన (ః) శ్రుతిస్మృత్యో

రెండవరేకు, రెండవప్రక్క.

20 దితం ధర్మమనిశం పర్యపాళతే తేభ్య [ః] ఆదిత్యభట్టయజ్ఞభట్ట శండిదేవభట్ట

21 ప్రముఖేభ్యః సిసిడి గ్రామార్జిత గోజాదీక్షితవం జ్ఞకేభ్యః భారద్వాజగోత్రేభ్య [ః] ఆజ్ఞే

22 రనశార్మాస్వత్యభారద్వాజప్రవరేభ్య [ః] సూ ర్యగ్రహణనిమిత్తే సిసిడి ప్రవేశం కన్ద

23 లీ నాడ గ్రామోన [తః] సర్వకరపరిహారే ణా చన్ద్రార్కం యధోచితభోగభాగాది

24 నాపుఖం ప్రతివసథేతి తతః ప్రాదాక్షిణ్యేన సీమాలిఙ్గాని లిఖ్యం

25 స్తే ఈశాన్యాందిశి సిసిడిభాదివాడకన్దలివాడా నాం త్రికుటే తింతిత్రిణివృక్ష [ః]త

26 తో వనరాంజీ తత శ్శిలానముద్ర [ః] తత[ః] ప్రాచ్యదిశి సైవవనరాజీ తింత్రిణీవృక్ష

27 సహితా యావత్ గుల్మసహితవాల్మీక[ః] తద కా [న్వా] గ్నేయాం దిశిభూశిలాపంక్తి[ః] యా

28 వత్ పర్వతితత[ః]శిలాసఙ్ఘు [ః] తతో నేక నింబసహితా వనరాజీతతో దక్షిణస్యాం

29 దిశి సైవ వనరాజీ హరిద్రావృక్షసమన్విత వా ల్మీకసహితా సైనతింతిత్రిణీ



మూడవ రేకు, మొదటి ప్రక్క

30 వృక్షసహితా వాల్మీకసహితా తత(ః) నైఋ త్యాందిశి తింతిత్రిణివృక్షద్వయసహితా తత కన్ద

31 లివాడ కోలణమ్మరినావేదావాడానాం త్రికు ట్టే వాల్మీక[ః]తత[ః] ప్రతీచ్యాందిశి తింత్రిణీతాలవ

32 త్రీసహితా తత[ః] శాల్మలీవృక్ష[ః]తత[ః] క న్దలివాడనాపితవాడ సిపిడీనాం త్రికూటే తాల

33 ద్వయహరిద్రావృక్షసహిత సైవ వనరాజీ భవి ష్యద్భూభుజాంనాజ్ఞాపయతి పాత్రిణాయ లోకస్య

34 గ్రహితాచాపాం సాగామినోపాం ప్రణతో బ్రవీమి। సాధారణః సర్వనరాధిపానాం ధ

35ర్మో విశుద్ధో భువిపాలనీయ [ః] విదితం నియ తం క్రియాఫలం చరితం సచ్చపురాణభు

36 భృతాం కతిచిచ్చ దినాని జీవితం హరణా త్పాలనమేవ శోభితం పాత్రే సమర్పణాదేవ కృతా

37 ద్ద్రోహం నరాధిపాః త[స్మా]మిత్ర మపుణ్యాం మ్వామాభూదితి నివేదితం అనాదవ్యాసః స్వదత్తాం పర

38 దత్తా మ్వాయత్నా ద్రక్షయుధిష్టిర। మహీం మహింమతాం శ్రేష్టదానాచ్ఛ్రేయో నుపాలనం షష్టి

39 వర్ష సహస్రాణి స్వర్గేతిష్టతి భూమిదః ఆక్షే ప్తా చానుమంతాచ। తాన్యేవనరకే వసేదితి



మూడవ రేకు, రెండవ ప్రక్క

40 ప్రవర్ధమానవిజయరాజ్యసంవ్వత్సరాణాం శత త్రయసప్తాధికానవతి అంకేనాపి

41 3రు— మధపేణలిఖితం సప్వదపేనో [ల్లి] ఖితం భట్ట శ్రీధరేణ భటయజునచ

43 పరిక్షితం

ఆంధ్రానువాదము:—ఓం. స్వస్తి శ్రీమంతము లగు యనేక దేవాలయములచే వ్యాప్తమైనదియు, సురలోకమునకు సాటియగునదియు, కల్పాంతమం దొనరింపఁబడిన యధిక జనసామ్రాజ్యముచే మోహింపఁజేయఁబడినమహామహిమఁ గలదియుఁ భూతలమున కలంకారము నగుకళింగనగరమునం దుండి; ప్రసిద్ధు లగుసిద్ధులచేతను దాపసులచేతను నివసింపఁబడిన గుహాంతరములుంగలమహేంద్రపర్వత శిఖరమునకు శిరోభూషణమైనట్టియు సురాసురులకు గురువును ముల్లోకము లనుగొప్ప మేడల నిర్మించు శిల్పాచార్యుఁడును, భగవంతుఁడునగు గోకర్ణస్వామియొక్క పాదోదకముచేఁ గడిగివేయఁబడిన కలికాలకల్మషము గలవాఁడును, గంగవంశమునకు శిరోరత్నమైనవాఁడును తళతళలాడుతనభుజము లను వజ్రములచే నలరింపఁబడిన కళింగాధిరాజ్యము గలవాఁడును, చల్లనిపిల్ల తెమ్మెరలచే వ్యాప్తమగు తీరమునందలి తరంగములు గలసముద్రములను మొలనూలుగల భూమియందు వ్యాపించిన నిర్మలయశము గలవాఁడును అనేకయుద్ధములందు గలిగినజయముచేఁ బ్రకటింపఁబడిన ప్రతాపముచే వంచఁబడిన సకలసామంత రాజులయొక్క కిరీటములందలి రత్నములకాంతులచేఁ బ్రకాశింపఁజేయఁబడిన పాదములు గలవాఁడును, పరమమాహేశ్వరభక్తుఁడును, తలిదండ్రుల పాదములను ధ్యానించువాఁడును మహారాజాధిరాజపరమేశ్వరుఁడును, శ్రీమద్భూపేంద్రవర్మతనయుఁ డగు శ్రీదేవేంద్రవర్మ; ఏవీరుఁడు తనకత్తిచే నఱకఁబడిన సకలరిపుకులము గలవాఁడై అనన్యశాసనమువలన భూమిని బాలించుచున్నాఁడో, నీటినురుగులవలెఁ దెల్లనైన యెవనికీర్తులు మహోదధితీరమున వ్యాపించి యలలతోఁ ద్రోపాడుచున్నవో, ఎవఁడు రాజ్యము చేయుచుండఁగాఁ బరద్రవ్యాపహరణము లేకుండుటం జేసి స్తేయశబ్దము వ్యర్థమయినదో ఎవనికి (భూపేంద్రవర్మ) కుమారసింహుఁడు జనకుఁడు వజ్రి (ఇంద్రవర్మ) పితామహుఁడు దేవేంద్రవర్మ యను తాను కుమారుఁడో, (అభూపేంద్రవర్మ గుణకీర్తన మిది. (పైవర్ణనము) అభూపేంద్రవర్మ కుమారుఁ డగుదేవేంద్రవర్మ కోలువర్తనివిషయమందలి కఁదలివాడగ్రామవాసు లగుకుటుంబముల నొక్కచోటఁ గూడినవారి నాజ్ఞాపించుచున్నాఁడు: నాతలిదండ్రులయొక్కయు నాయొక్కయుఁ బుణ్యాభివృద్ధికై యొనర్చిన యీధర్మమును మీ రెఱుంగుదురుగాక; నా చేతను యజ్ఞము చేయుట వేదములుచదువుట మొదలగు సత్కార్యములం దాసక్తిగలవారును సిపిడిగ్రామవాస్తవ్యులును వేదములను వేదాంగములను జదివినవారును ఎప్పుడును శాస్త్రచోదితమయిన ధర్మమును నడపువారును సిపిడిగ్రామార్జితగోవాదీక్షితవంశమునం బుట్టిన

వారును అంగిరసబార్హస్పత్యభారద్వాజప్రవరాన్విత భారద్వాజగోత్రులు నగు ఆదిత్యభట్టు యజ్ఞభట్టు కండిదేవర భట్టు మొదలగు వారికొఱకు సూర్యగ్రహణసమయమున జంపలివాఘుగ్రామమందలి నివిడిప్రదేశము ఏవిధమగుపన్నులు లేకుండ దానము చేయఁబడినది. ఆచంద్రార్కముగా దానిని వారుఉచితభోగభాగాదులతో సుఖముగా ననుభవింతురుగాక.

ఈశాసనమును శాళ్ళబండి సుబ్బారావుగారు ఎం. ఎల్. టి, ఇంగ్లీషులో ఆంధ్రదేశీయేతిహాసమండలివారి ఇంగ్లీషు త్రైమాసికపత్రికలో సం॥ 2. భా॥ 2. లో సంస్కరించి ప్రకటించినారు.

—————

## మూఁడవ వజ్రహస్తుని చికాకులవలస శాసనము.

———

[శ్రీయుత మల్లంపల్లి సోమశేఖర శర్మగారు]

ఈతామ్రశాసనము ఉర్లాము, కంబకాయ గ్రామములకు మధ్యగా నొకమైలు దూరముననున్న చికాకులవలస అను నొకగ్రామమునందలి రైతు తనపొలమును దున్నుకొనుచుండగా బయలుపడినది.

శాసనమునందలి లిపి నాగరి, కాని యిప్పటినాగరి అక్షరములకు, శాసనములోని అక్షరములకు- జాల వ్యత్యాసము కలదు. అయినను ఇప్పటి నాగరి లిపి శాసనమునందలి లిపియొక్క పరిణామమే యనుట స్పష్టము.

శాసనమంతయు సంస్కృతభాషలోఁ గలదు. గద్యపద్యాత్మకము. శాసనమున పండ్రెండు శ్లోకములు కలవు. ఇవి శార్దూలవిక్రీడితము, మాలిని, వసంతతిలకము మొదలగు వేర్వేఱు వృత్తములలోఁ గలవు. ఈశాసనము గాంగవంశజుండైన అనంతవర్మాభిధానుండగు వజ్రహస్తదేవునిది. గాంగవంశజులలో వజ్రహస్తుఁ డను పేరుగల వారిలో నీతఁడు మూఁడవవాఁ డగుటచే నీతనిని గాంగవంశచారిత్రమున మూఁడవ వజ్రహస్తుఁ డందురు. ఈవజ్రహస్తవంశీయులైన గాంగులు ఆత్రేయ గోత్రులు; పరమమాహేశ్వరులు; పరమ భట్టారకులు; త్రికలింగ మహీభుజులు. శాసనమున మొట్టమొదట వారివంశ ప్రశస్తికలదు. పిదప వజ్రహస్తుని వంశానుక్రమము తెలుపఁబడినది.

సూర్యుఁడు వృషభ రాసియం దుండఁగా. త్రొమ్మిదివందల అఱువదవ శకవర్షమున చంద్రుడు ధనుర్లగ్నమున రోహిణిలోనుండ, అనఁగా క్రీస్తుశకము ౧౦౩౮ వ సంవత్సరము మే నెల మూఁడవ తేది ఆదివారము రాత్రి ఎనిమిదిగంటల ఇరువదియేడు నిమిషములకు శుక్లపక్షతృతీయా ఆదివారము నాఁడు అనంతవర్మాభిధానంబునం బరగు నీ (మూఁడవ) వజ్రహస్తుఁడు సకలధరాతలమును సంరక్షించుటకుఁ బట్టాభిషిక్తుఁ డయ్యెను. శకము ౯౮౪-వ సంవత్సరమున నీవజ్రహస్తదేవుఁడు కోలువర్తని విషయములోని కుద్దమాఖ్య గ్రామమును మల్లవశ్రేష్ఠి. అనునొక వైశ్యునికి దాన మొసంగెను.

### కాలనిర్ణయము.

అనంతవర్మాభిధానుండగు వజ్రహస్తదేవుఁడు మల్లవశ్రేష్ఠికి కుద్దమాఖ్య గ్రామములు శాలివాహనశకము కర (౪) వసు (౮) నిధి (౯) అనువానిచే నంకితమగు ౯౮౪ వ సంవత్సరమున కార్తికమాస ప్రథమపక్ష తృతీయా సోమవారమున దాన మొసంగెను. కార్తికశుక్లపక్ష తృతీయనాఁడు ఆలోచన గౌరీవ్రతమను నొక శైవవ్రతము చెప్పఁబడియున్నది. వజ్రహస్తదేవుఁడు పరమమాహేశ్వరుఁడని వర్ణింపఁబడిన పరమశైవుఁడు. అదిగాక కార్తికమాసము శైవుల కత్యంతప్రీతి. అందువలనే కార్తికమాస శుక్లపక్ష తృతీయనాఁడు ఆలోచనగౌరీవ్రతసందర్భమున మహారాజైన వజ్రహస్తుఁ డీదానమును జేసి యుండును.

———

## మూలము.

### మొదటి రేకు; రెండవ వెడ.



1 ఓంస్వస్తి శ్రీ కతా మఖిలభువనవినుతనయదయ దానదాక్షిణ్యస

2 త్యశౌచ శౌర్యధైర్యాది గుణరత్నపవిత్ర కాణా మాత్రేయగోత్రాణామ్ వి

3 మలవిచారాచార పుణ్యసలిలప్రక్షాలిత కలికాల కల్మషమ

4 షిణామ్ మహేన్ద్రాచల శిఖరప్రతిష్ఠతస్య సచరాచరగురో

5 : సకలభువన నిర్మాణైకసూత్రధారస్య శశాఙ్క చూడామణే

6 ర్భగవతో గోకర్ణ స్వామినః ప్రసాదాస మాసాదితైకశఙ్ఖభే

7 రీపఞ్చమహాశబ్దః ధవలచ్ఛత్ర హేమచామరవర వృషభలాఞ్ఛనసము

8 జ్వలసమస్త సామ్రాజ్యమహిమ్నామనేకసమరస ఙ్ఘట్టసము

### రెండవ రేకు మొదటి వెడ.



9 పలబ్ధ విజయలక్ష్మీ సమాలిఙ్గితోత్తుంగ భుజదణ్డమ
ణ్డితానామ్
10 త్రికలిఙ్గమహీభుజాం గఙ్గానామన్వయ మల
ఙ్కరిష్ణు విష్ణోరివ
11 విక్రమాక్రాన్త ధరామణ్డలస్య గుణమహార్ణ్ణవ
మహారాజస్య పుత్రః॥౧॥పూ
12 ర్వమ్ భూపతిభిర్వ్విభజ్య వసుధాయాప
ఞ్చభిః పఞ్చధా భుక్తా భూరిపరా

13 క్రమోభుజ వలాత్తామేక ఏకస్వయమ్ ఏక్రా
త్యవిజిత్యశత్రునివహా
14 స్ శ్రీవజ్రహస్తశ్చతుశ్చత్వారిమ్ శతమత్యుదా
రచరితః సర్వ్వామరక్షీత్సమా
15 తస్యతనయో గుణ్డరాజా వర్షత్రయమపాలయ
త మహీమ్॥ తదనుజః కా
16 మార్ణ్ణవదేవః పఞ్చత్రింశత మబ్దకాన్॥ త
స్యానుజో వినయాదిత్య సమా

## రెండవ రేకు, రెండవ పెడ.



17 స్త్రిస్రి[ః]తతః కామార్ణ్ణవాజ్ఞతో జగతీకల్పభూ
రుహః యోరాజద్రాజిత (ః) చ్ఛా
18 యోవజ్రిహస్తోవనీపతిః ప్రశ్చ్యోతదన్మదగన్ధలు
బ్ధమధుప వ్యాలీఢగణ్డాన్గ
19 జా : ద్వి ర్థిభ్యః సమదాత్సహస్రమతులో
యస్త్యాగినామగ్రణీ స (ః) శ్రీమానవినయఃబ్క
20 భీమన్నృపతిర్గ్గఙ్గాన్వయో త్తంసకః పఞ్చత్రిం
శతమబ్దకాన్స

21 మభునక్పృథ్వీమ్ స్తుతఃపార్థివైః॥ తదగ్రి
సూనుః సురరాజసూనునా
22 [స] మస్సమస్తాం సమితారి మండలః స్మృపాతి
కామార్ణ్ణవ భూపతిర్బ్భువం సమృద్ధి
23 మానర్ద్ధసమాం సముజ్వలఃతదనుతదను జన్మో
పమానో గుణ
24 నిధిరనవద్యో గుణ్డమాఖ్యో మహీశః సకలమిద
మరక్షత్త్రీణివర్షా

## మూడవ రేకు, మొదటిపెడ



25 ణిధాత్రీవలయ మలఘు తేజోనిర్జిత తారాతిచక్రః
శౌర్ద్ర్య మాతురస్తస్య మ

26 ధుకామార్ణవో నృపః అశీతి సప్తవర్షమేతా
మద్దానేకార్ణవింశంతిం

27 అథవజ్రహస్త నృపతిరగ్ర్య ముతాదఖిలగుణిజ
నాగ్రిగణ్య కామార్ణవాత్కుపీన్ద్రి

28 పరిగీయమానావదాతశుభకీర్తేః శ్రియ ఇవవై
దుమ్బా న్వయపయఃవ

29 యోనిధిసముద్భవాశ్చయః సహజనివినయమహా
దేవ్యాః శ్రీవజ్రహస్త

31 ఇతితనయ వియదృతునిధి సంఖ్యాం యాతిశా
కాబ్ద సఙ్ఘే ది

31 సకృతివృషభస్థే రోహిణీ భనులగ్నే ధనుషిచ
సిత పక్షేసూర్యవారేత్రు

32 శ్రీమా(ము) యుజిసకలధరిత్రిమ్ రక్షితమ్ యో
భిషిక్తః న్యాయ్యేనయత్రిసమమా

33 చతుం త్రివర్గమార్గేణ రక్షతి మహీమ్
మహితిపరితాపే నివార్యథ

## మూడవ రేకు, రెండవ పెడ.



34 యశ్చ నిరఘాశ్చ నిరాపదశ్చ శశ్వత్ప్రజా
భువి భవన్తి విభూతి మత్యర్థ వ్యాప్తేగజ
35 కులోత్తమస్య యశస దిక్చక్రవాలేశశి ప్రద్యో
తామలినేన యస్యభువన ప్రహ్లాద
36 సమ్పాదినా సైన్దూరై రతిసాన్ద్రబ్జ్యపటలై
కుమ్భస్థలీ పట్టకే శ్యాలిమ్పన్తి పున
37 పునశ్చహరతా మాధోరవారణాన్ అనురాగేణ
గుణినో యస్యవ
38 త్రిమోముఖాబ్జయో ఆసినే శ్రీసరస్వత్యా వసు
కూలే విరాజతే క
39 లిఙ్గన [x] రాత్పరమ మాహేశ్వర పరభ
ట్టారక మహారాజాధిరాజ త్రి
40 కలిఙ్గాధిపతి శ్రీమదనన్తవమ్మదేవ వజ్రహస్త
దేవః కుశలీ సమస్తామాత్య
41 ప్రముఖజనపదా న్సమాహూయ సమాజ్ఞాపయతి.
విదితమస్తు భవతామ్
42 ఉపర్త్తనివిషయే కోకుద్దమాఖ్యగ్రామః సీమా.
వచ్ఛిన్నః సజ

నాలుగవరేకు మొదటి వైపు.



43 లస్థలః సర్వపీడా వివర్జితనచన్ద్రార్కక్షి
తీతి సమకాలం యావన్మాతాపిత్రో
44 రాత్మనః పుణ్యయశోభివృద్ధయే। కరవసునిధి
శాకాబ్దే కార్త్తికమాసప్రథ
45 మపక్షే తృతీయా సోమవారే। దత్తగోత్రస్య
వైశ్యకులోద్భవః మాధవాఖ్యః
46 తస్యపుత్రః సోమనశ్రేష్ఠః। తస్యభార్యాకర
రయాపా। తయోజ్జాతా ను
47 మల్లపశ్రేష్ఠాయ ఉదకపూర్వం తామ్రశాస
నం కృత్వా ప్రదత్తోస్మాభి
48 ర్భావిభి ర్భూమిపాలైర్మనో [క్త]
ధర్మ గౌరవాత్పరిపాలనీయ ఇతి
49 రాజ్ఞః శాసనం లబ్ధ్వా పునరయం గ్రామః
గృహస్థానమాద్యాన
50 స్థానంచ। శతను. రాధాన్యోత్పన్న భూమిశ్చస్వస్య
శేషయుతా। జల

నాలుగవ రేకు; రెండవ పెడ.



51 మ్యూవరాఖ్య గ్రామనివాసీ। వత్ససాశ్చ శివ
షన్యగోత్రస్య। ద్విజోత్తమః। పి

52 ల్లిశర్మా॥ తస్య పుత్రః కరంటమనాయకః। తస్య
భార్యా రేకపాత్రయో

53 జ్ఞాతేన। మాచయనాయకేనసహితైః ఏభిః
బ్రాహ్మణేభ్యః అగ్రహా

54 రంకృత్వా ఉత్తరాయణ నిమిత్తా। మల్లయక్షే
త్రేన ధారా పూర్వం

55 కం। కుద్దాఖ్యగ్రామంప్రదత్తమితి। అస్యగ్రా
మస్య ఉత్పన్న

56 కరైః రాజ్ఞా (౦)దేయమ్ శతమర ధ్యాసై
రష్టమాడైశ్చ॥

---

## మూడవవజ్రహస్తుని బొడ్డపాడు తామ్రశాసనం.

### శ్రీయుత మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు

సుమారు ఇరువదేండ్లక్రిందట బొడ్డపాడు నివాసులైన వెలమనక్క అప్పలనాయుడుగారు తమ యూరికి తూర్పుదిక్కున ఏబదిగజముల దూరమున నున్న తమ పొలమును వరిసాగుకు అనుకూలమగు పల్లము చేయుటకై త్రవ్వించుచుండగా ఈతామ్రశాసన మందు దొరికినది. ఈ శాసనము దొరకిన స్థలమునకు 1౦ గజముల దూరమున స్థాపితమైన యొకలింగము కూడ కానవచ్చినది. దానికి పూర్వమున్న పేరు తెలియదుకాని యిటీవల బొడ్డపాడు గ్రామనివాసులు మల్లికేశ్వరుడని పేరిడిరి. ఈలింగమున కుత్తరదిశను ఇరువదిగజముల దూరములో 'లింగాలబంద' అను చిన్నకోనేరు కలదు. శాసనమునందుగల రాగిరేకులు అయిదు. ఒక్కొక్కరేకు పొడవు ౮.౪ అంగుళములు; వెడల్పు 3. 3 అంగుళములు. రేకులు కుడి, యెడమవైపుల కొంచెము వెడల్పుగను, నడిమిభాగమున కొంచెము సన్నముగ నున్నవి. రేకుల ఎడమభాగమున అంచులకు ౮. అంగుళముల దూరమునగల రంధ్రములయందు నొక రాగికడియమును పోనిచ్చి, తద్ద్వారమున ఈరేకులను బంధించియున్నారు. కడియముయొక్క వ్యాసము 3.౫. అంగుళములు. ఈకడియ మొక రాజముద్రికలో నతికింపబడియున్నది. రాజముద్రికమీద స్ఫుటముగ నొకనంది చెక్కబడియున్నది. ఆనంది కిరుప్రక్కల చంద్రుడు, అంకుశము, నాగలి, శంఖము, మత్స్యము, స్పష్టముగ ఇదియని తెలియరాని దేదో మరియొక చిహ్నము—ఇవి కలవు. మొదటిరేకు మొదటిపెడమీదను, అయిదవరేకు రెండవపెడమీదను, వ్రాత యేదియు లేదు. పుస్తకమునకు అట్టలవిధమున ఈశాసనమునకు ఈ రెండుపెడలను ఉపకరించుచున్నవి

శాసనలిపి నాగరి. ఇది మూడవ వజ్రహస్తుని చిక్కాలవలస శాసనము నందలి లిపిని బోలియున్నది. అందువలన అక్షరముల విషయమున జెప్పవలసిన విశేషములు

చిక్కులవలన శాసనమునందలి వాటికంటె నేవియు కనబడవు. భాష సంస్కృతము: శాసనము వ్రాసిన వాడు చాల అశ్రద్ధతో వ్రాసియున్నాడు;

ఈశాసనము కళింగ గంగవంశజుడైన అనంతవర్మాభిధానుండగు మూడవ వజ్రహస్తదేవునిది. ఈరాజు కళింగ దేశమును శాలివాహనశకము ౯౬౦ మొదలు ౯౯౩ వఱకు, అనగా క్రీ. శ. ౧౦౩౮ మొదలు ౧౦౭౦ వఱకు పాలించినవాడు.

మూలము.

మొదటిరేకు, రెండవపేడ.

1 ఓం స్వస్తిశ్రీ మతామఖిలభువన వినుతనయ వినయదయాదాన దాక్షిణ్యసత్యశౌ

2 చ శౌర్య్య ధైర్య్యాది గుణరత్న పవిత్రాణా మాత్రేయ గోత్రాణామ్ విమలవిచారాచార

3 పుణ్యసలిల ప్రక్షాలిత కలికాలకల్మష మషీణామ్ మహామహేన్ద్రాచల

4 శిఖరప్రతిష్ఠితస్య సచరాచరగురోః సకలభువన నిర్మ్మాణైక సూ

5 త్రధారస్య శశాఙ్కచూడామణే ర్భగవతో గోకర్ణ్ణ స్వామినః ప్రసా

6 దసమాసాదితైకం శఙ్ఖభేరీ పఞ్చమహాశబ్దం ధవలచ్ఛత్రహేమ

7 చామరవరవృషభలాఞ్ఛన సముజ్వల సమస్త సామ్రాజ్య మహిమ్నా మనేక

రెండవ రేకు: మొదటి పెడ.

8 సమరసఙ్ఘట్టనముపలబ్ధం విజయలక్ష్మీ సమాలిఙ్గితోత్తుఙ్గభుజదణ్డను

9 ణ్డితానాంత్రికలిఙ్గమహీభుజాం గఙ్గానామన్వయమలంకరిష్ణో ర్విష్ణో రివ

10 విక్రమాక్రాన్తధరామణ్డలస్య గు (ణ) [మ] హార్ణ్ణవ మహారాజస్య పుత్రః॥ పూర్వ్వంభూపతి

11 భి ర్విభజ్యవసుధా యాపఞ్చభిః పఞ్చధాభుక్త్వా భూరిపరాక్రమో భుజబలాం

12 త్తామేక ఏవస్వయమ్ ఏకీకృత్యవిజిత్య శత్రునివహాన్ శ్రీవజ్రహస్తశ్చతుశ్చ

13 చత్వారిం శతమత్యుదార చరితః సర్వ్వానరక్షీత్సమాః తస్యతనయో [గు] ణ్డ మరాజావ

14 ర్షత్రయమపాలయత్ మహీమ్ తదనుజః కామార్ణ్ణవదేవః పఞ్చత్రింశత మబ్దకాన్

రెండవ రేకు: రెండవ పెడ

15 తస్యానుజో వినయాదిత్య సమాస్త్రిస్రః తతః కామార్ణ్ణవాజ్జా(ఽ) తో జగతీకల్పభూ

16 రుహః|యోరాజరాజ[ః] చ్ఛాయోవజ్రహస్తావనీపతిః ప్రశోచ్ఛ్రాయదన్మదగన్ధలుబ్ధ

17 మధుపవ్యాలీఢగణ్డాన్గజాన [స్న] ర్థిభ్యః సమదాత్ నేహాస్రిమతులో యస్త్యాగినామగ్రణీ

18 స [ః] శ్రీ మానవియఙ్కభీమ నృపతి గ్గఙ్గాన్వయోత్తం సకః పఞ్చత్రింశతమబ్ద

19 కాన్సమభున క్ష్మీధ్వీమ్ స్తుతః పార్థివైః త దగ్రసూనుః సురరాజ సూను

20 నాసమస్త మస్తాం శ మితారి మణ్డలః స్మపాతి కామార్ణ్ణవభూపతిభ్ర్భవం

21 సమృద్ధిమానర్ధసమ[ం] సముజ్జ్వలః [త]దను తదనుజన్మాచిత్తజన్మోపమ

మూడవ రేకు మొదటి పెడ

22 మానో గుణనిధిరనవద్యో గుణ్డమాఖ్యోమహీశః సకలమిదమరక్షత్త్రీణి

23 వర్షాణిధాత్రీ వలయమలఘు తేజో నిర్జరారాతిచ. త్రిః॥ తతోద్వైమాతురస్తస్య

24 మధుకామార్ణ్ణవోనృపః | అపాతిస్మావనీ మేతామబ్దానేకాన్న వింశతిమ్॥౦॥అథవ

25 జ్రహస్తనృపతేరగ్రసుతాదఖిలగుణిజనాగ్ర [గ] ణ్యః కామార్ణ్ణవాత్కవీన్ద్రప్ర

26 గీయమానావదాత శుభకీర్తేః॥ శ్రియఇవవైదుమ్యాన్వయ పయః పయోనను

27 నిధిసముద్భవాయాశ్చ యః సమజని వినయమహాదేవ్యాః శ్రీవజ్రహస్తఇతి

28 తనయః॥వియదృతుసంఖ్యాంయాతి శాకాబ్దేసఙ్ఘేదినకృతివృషభస్తే రోహిణీభే

29 లగ్నేధనుషి చసితపక్షేనూర్య్యవారేతృతీ [ం] యా[ం]యుజినకలధగతీం

॥౫]

## మూడవ రేకు; రెండవ వెడ.

30 రక్షితుం యోభిషిక్తః న్యాయ్యేన యత్రసమ
ముచరితుం త్రివర్గేణ మార్గేణ ర
31 క్షితిమహీమ్ మహిత ప్రతాపే నివ్యార్ధ
యశ్చ నిరఘాశ్చనిరాపదశ్చ శశ్వత్ప్రజా
32 భువి భవన్తి విభూతిమత్యః వ్యాప్తే గజకులో
త్తమస్య యశసా దిక్చక్రవాలేశ [శ్రీ]
33 ప్రద్యోతామలినేన యస్యభువనః ప్రహ్లాదస
మ్పదినా సిన్దూరై రతిసా
34 న్ద్రపఙ్కపటలై కుమ్భస్థలీ పట్టకేష్వాలిమ్పన్తి
పునఃపునశ్చ [హ]
35 రితామాధోరణావారణాన్॥ అనురాగేణగుణినో
యస్యవక్షోము
36 ఖాబ్జవయోః ఆసీనే శ్రీసరస్వత్యా వనుకూలే
విరాజితః॥ కలిఙ్గ
37 నగరాత్పరమమాహేశ్వర పరమభటారక మహా
రాజాధిరాజ త్రిక

## నాలుగవ రేకు; మొదటి వెడ.

38 లిఙ్గాధిపతి శ్రీమదనన్తవర్మ వజ్రహస్త దేవః కు
శలీ సమస్తామాత్యప్రము
39 ఖ జనపదాన్సమాహూయ సమాజ్ఞాపయతి విదిత
మస్తుభవతామ్॥ కోలువర్త్తని
40 వి[ష]యే అవరెంగాఖ్యగ్రామః। చతుఃసీమా
పచ్ఛిన్నః సజలస్థలఃసర్వపీడా
41 వివర్జిత మాచన్ద్రార్క క్షితి సమకాలం యా
వన్మాతాపిత్రో రాత్మనః పు
42 ణ్యయశోభి వృద్ధయే కర వసు నిధిశాకాబ్దే ఉ
త్తరాయణ సంక్రాన్త్యౌ
43 అస్మిన్ గ్రామనివాసినే జలేశ్వరదేవాయభోగం
కృతమ్ విశ్వ గోత్రో
44 త్పన్నః ఏరయమః తస్యపుత్రః మావయః తస్య
భార్యాకంచపా తదోజాన్ తాయఏరమాయ
45 మాచరమనవర్త్తికంచరిదత్తమ్॥ అస్యైవగ్రామ
స్యసీమా[ం]లిఖ్యన్తేపూర్వతః

## నాలుగవ రేకు; రెండవ వెడ.

46 నింబసహిత వల్మీకః। పరతః వనరాజీ ఆగ్నే
యతః తింత్రిణీకవృక్షత్రికూ
47 టః॥ దక్షిణతః వనరాజీ। పరతః సావనరాజీత్రి
కూటః॥ నైరృత్యతః గర్త్త
48 త్రికూటః పశ్చిమతః అజ్జనాఖ్యగర్త్త॥పర
తః తింత్రిణీకవృక్షసహితసేతు
49 ః॥ వాయవ్యతః మణ్డలాకార పాషాణసహిత
గర్త్త ద్వౌగర్త్తాస
50 ంగమేవ పరతః అర్జునవృక్షః తత్పరతః తిం
త్రిణీక వృక్షాద్వా
51 ఐశాన్యతః నింబసహిత వల్మీకః పరతః గర్త్త
స [మీపత్రికూటః॥]
52 అనేన మహాక్షశాలయే వల్లేమోజాయస్వర్ణ
లోహకారిణేచ [మనవర్త్తికాస్మిన్] గ్రా
53 మేప్రదత్తా॥ భూమిం యః ప్రతిగృహ్ణాతి
యచ్ఛతి భౌతౌపుణ్య

## అయిదవ రేకు; మొదటి వెడ.

54 కర్మాణౌ నియతా[ం] స్వర్గగామినా॥షష్టిం
వర్షసహస్రాణి స్వర్గేమోదతి భూ
55 మిదః ఆక్షేప్తంచానుమన్తాచ తాన్యేవ నరకే
వసేత్॥ మహా [కాయస్థసన్ధి] వి
56 గ్రహిమావురయస్యనూనునాదామోదరేణ లిఖి
తమ్॥ మహాక్షశాలినుంకమో
57 జస్యసూనునా వల్లేమోజేన ఉత్కీర్ణతమ్॥

## శా స న సా ర ము.

శాసనమునందు మొదట ఆత్రేయ గోత్రులైన త్రికలింగాధిపతు లగు గంగవంశజుల ప్రశస్తి కలదు. పిదప గుణమహార్ణవ మహారాజుకొడుకైన మొదటివజ్రహస్తునినుండి కామార్ణవ భూపతికిని, వైదుంబవంశ మను పాలసముద్రమం దుద్భవమందిన వినయమహాదేవికిని జన్మించిన మూడవవజ్రహస్తునినుండి కామార్ణవభూపతికిని, వైదుంబవంశమను పాలసముద్రమం దుద్భవమందిన వినయమహాదేవికిని జన్మించిన మూడవవజ్రహస్తుని వఱకుగల గంగవంశపు రాజుల

వర్ణనాదికములు కలవు ఈ మూడవవజ్రహస్తుడే మనశాసనము నందలి దాత. ఈతని యితర శాసనములలో వలెనే ఇందును ఆరాజు శకాబ్దములు ౯౭౦లో పట్టాభిషిక్తుడయ్యెనని తెలుపబడినది. పిదప న్యాయయమును, ప్రజారంజకమును నైన యతని పరిపాలనము వర్ణింపబడినది. అటుతరువాత పరమమాహేశ్వరుడును పరమభట్టారకుడును, మహారాజాధిరాజును, త్రికలింగాధిపతియునైన శ్రీమదనంతవర్మ యను వజ్రహస్తదేవుడు కళింగనగరమునుండి తన తల్లిదండ్రులయొక్కయు, తనయొక్కయు, పుణ్యయశోభివృద్ధికొఱకు సమస్తామాత్య ప్రముఖజనపదులను పిలిచి వారిసమక్షమున శకాబ్దములు, కరములు [2] వసువులు [8] నిధులు [9] అనుసంఖ్యలచేత అంకితమైన సంవత్సరమున అనగా ౯౮౨ వ శకవర్షమున ఉత్తరాయణ సంక్రాంతి నాడు కోలువర్తని విషయములోని అవరెంగ అనుపేరుగల గ్రామమును చతుస్సీమావచ్ఛిన్నముగను, సజలస్థలముగను సర్వపీడావివర్జితముగను అనగా జలసహితముగను స్థలసహితముగను ఏవిధమైనపన్ను ప్రత్యాయముల బాధలులేకుండగను చేసి ఆగ్రామమున విజయంచేసియున్న జలేశ్వరస్వామి అను పేరుగల దేవునికి భోగముచేసి అనగా దేవునికి చెల్లె గ్రామముగ ఏర్పాటుచేసి దానమొసంగబడినది. జలేశ్వర దేవునికి చేసిన యీదానమును తెలుపుటకే ఈశాసనము పుట్టినది. ఈగ్రామమును జలేశ్వరస్వామికి దానమొసంగు సందర్భముననే మరి యిరువురు గ్రామస్థులకు (1) ఎరయముడు అనువానికిని (2)మహాత్మశాలియు, స్వర్ణలోహకారకుడు అయిన వల్లేమోజునకును వృత్తులొసంగబడినవి. పంక్తులు 45 మొదలు 52 వఱకు దానముచేయబడిన గ్రామముయొక్క సరిహద్దులు తెలుపబడినవి. చిట్టచివర దానశాసనములకు వ్రాయబడు మామూలు శ్లోకములు కలవు. [పం. 53-55] కడపటి రెండుపంక్తులలోను శాసనమును వ్రాసిన వాని పేరు శాసనమును చెక్కినవాని పేరు తెలుపబడినవి. శాసనమును వ్రాసిన యతడు మాపురయముమారుడైన దామోదరుడు. ఇతడు మహాకాయస్థుడనియు, సంధివిగ్రహిఅనియు తెలుపబడినాడు. సంధివిగ్రహి అనగా యుద్ధము ప్రకటించుట, సంధిసేయుట అనుకార్యములను పరిశీలించు మంత్రి). శాసనమును చెక్కినవాడు నూంకమోజకొడుకైన వల్లేమోజు శ. 1003 నాటి అనంతవర్మ చోడగంగదేవుని కొర్ని శాసనమును వ్రాసినవారును చెక్కినవారును వీరలే ఎరయముడు అనువాని కిచ్చిన వృత్తి 'మూదరమనువత్తిఓకము' అని శాసనమున చెప్పబడినది. ఇప్పుడు మనము 'మనోవర్తిక' అను నదియే ఈ 'మనవర్తికము' అని నా యభిప్రాయము.

గ్రామమును దానమొసంగినది శకవర్షము 982లో ఉత్తరాయణ సంక్రాంతినాడు అనగా ఈశానము క్రి. శ. 1059-60 వ సంవత్సరము నాటిది అగును.

ఈశాసనమును చేర్కొనబడిన అవరెంగ, జల్మూరు, ముద్దాము మొదలగు గ్రామములున్న యిప్పటి శ్రీకాకుళము తాలూకా (గంజాంజిల్లా) పూర్తిగనో, లేక కొంతభాగమో కోలువర్తనీ విషయమని ప్రాచీనకాలమున పేరొందియుండినట్లు చిక్కాలవలసశాసనమువలన తెలిసికొనియున్నాము. ఆనిర్ణయమునే యీశాసనము బలపఱచుచున్నది. దానముచేయబడిన అవరెంగ అను గ్రామమిప్పుడు ఆవలింగ అనుపేర బరగుచున్నది.

[అక్షయసం॥ వైశాఖమాసపు భారతినుండి]

---

## 14అనంతవర్మ చోడగంగ దేవుని కొర్ని శాసనము.

### మహారాజశ్రీ గిడుగు వెంకటశీతాపతి గారు

ఈశాసనము అయిదురేకులు గలది. ప్రతిరేకున్ను సుమారు 8¼ అంగుళములు పొడవుగాను, 4 అం. వెడల్పుగాను ఉన్నది. రేకులన్నిటికిన్ని ఎడమవైపు అంచుకు సుమారు ఒక అంగుళము దూరముగా రంధ్రములున్నవి. వాటిగుండా ఒకరాగి కడియము అమర్చబడి ఉన్నది. ఆకడియమునకు ఈఅయిదు రేకులున్ను వ్రేలాడుతున్నవి. కడియము చుట్టుకొలత 15¼ అంగుళములు. కడియముకడ్డీ చుట్టుకొలత ఒక అంగుళము. ఈకడియము తాలూకు రెండు కొవలున్ను వలయాకారమున ఉన్న ఒక రాజముద్రికకు అంటివున్నవి. ఆ రాజముద్రిక 1¼ అం. ఎత్తుగ ఉన్నది. వలయాకారమున ఉన్నదాని అడుగుభాగము 7 అంగుళముల పరిధిగలది. రాజముద్రికయందు 1 1/2అం. ఎత్తుగల నందివిగ్రహమున్నది. ఆనంది విగ్రహమునకు నాలుగువైపులను శంఖము, చామరము మొదలయినవి చెక్కినారు.

ఈశాసనమునందలి భాష మొదటనుండి చివరకున్ను సంస్కృతము. లిపి ప్రాచీననాగరి లిపి.

---

## మూలము.



మొదటి రేకు; రెండవ వైపు.

1 ఓం. స్వస్తి శ్రీమతా మఖిలభువన వినుతనయ వినయదయాదానదాక్షిణ్య సత్య

2 శౌచశౌర్య ధైర్యాదిగుణరత్న పవిత్రీకాణా మాత్రేయగోత్రాణాం

3 విమలవిచారాచారపుణ్యసలిల ప్రక్షాలితకలికాల కల్మషమషీ

4 ణాం మహామహేన్ద్రాచల శిఖరప్రతిష్ఠితస్య సచరాచరగురోః సకల

5 భువననిర్మాణైకసూత్రధారస్య శశాఙ్కచూడామణే ర్భగవతో

6 గోకర్ణస్వామినః ప్రసాదా త్సమాసాదితైక శఙ్ఖభేరీపఞ్చమహా

7 శబ్దధవలచ్ఛత్ర హేమచామరవరవృషభలాఞ్ఛనసముజ్వల సమస్తసామ్రా

8 జ్యమహిమ్నా మనేకసమరసఙ్ఘట్టసముపలబ్ధవిజయలక్ష్మీ సమాలి



రెండవ రేకు; మొదటి వైపు

## రెండవ రేకు: మొదటి పెడ.

9 జ్జితోత్తుఙ్గ భుజదణ్డమణ్డితానాం త్రికలిఙ్గమహీభు
జాం గఙ్గా
10 నా మన్వయ మలఙ్కరిష్ణో ర్విష్ణోరివ విక్రి
మాక్రాన్తధరామణ్డలస్య
11 గుణమహార్ణవమహారాజస్య పుత్రః॥౦॥ శ్రీ
వజ్రహస్తదేవ శ్చతుశ్చ
12 త్వారింశత మబ్దకాన్ క్షితి మరక్షీత్॥ తత్రి
నయో గుణ్డమరాజా వ
13 షట్త్రియ మపాలయత్॥ తదను తదనుజః కా
మార్ణవదేవః ప
14 ఞ్చత్రింశద్వర్షాణి॥తస్యానుజో వినయాదిత్యః
సమా స్త్రిస్రః
15 ॥తతః కామార్ణవతనయో వజ్రహస్తః రూపా
దగలిత గణ్డాన్ గ
16 జాన్ సహస్రి మర్థిభ్యః సమదాత్ సపఞ్చ
త్రింశత మబ్దకాన్



## రెండవ రేకు; రెండవ పెడ.

17 ॥తత స్తదగ్రసూనుః కామార్ణవదేవోర్ధ స
మామ్॥తత స్తదనుజో
18 గుణ్డమహీపతి స్త్రీణి వర్షాణి॥తదను తస్య
ద్వైమాతురో మధుకా
19 మార్ణవ ఏకోనవింశతివర్షాణి॥తతః కామా
ర్ణవాద్వైదు
20 మ్బాన్వయసముద్భవాయాం వినయమహాదేవ్యాం
జాతః శ్రీవజ్రి
21 హస్తదేవో యోదివః పతన్త మతిభీషణ మశ
నిం శస్త్రాగ్నిభి
22 జఘాన స త్రయస్త్రింశత వబ్దకా నవని మపాల
యత్॥ తతస్తు తస్యా
23 త్మభవోరిమర్దన స్సురాజరాజక్షితిపః క్షితిం
సమాః।అ

వర్ణనాదికములు కలవు ఈ మాడవవజ్రహస్తుడే మనశాసనము నందలి దాత. ఈతని యితర శాసనములలో వలెనే ఇందును ఆరాజు శకాబ్దములు ౯౬౦లో పట్టాభిషిక్తుడయ్యెనని తెలుపబడినది. పిదప న్యాయమును, ప్రజారంజకమును నైన యతని పరిపాలనము వర్ణింపబడినది. అటుతరువాత పరమమాహేశ్వరుడును పరమ భట్టారకుడును, మహారాజాధిరాజును, త్రికలింగాధిపతియునైన శ్రీ మదనంతవర్మ యను వజ్రహస్తదేవుడు కళింగనగరమునుండి తన తల్లిదండ్రులయొక్కయు, తనయొక్కయు, పుణ్యయశోభివృద్ధికొఱకు సమస్తామాత్య ప్రముఖజనపదులను పిలిచి వారిసమక్షమున శకాబ్దములు, కరములు [2] వసువులు [8] నిధులు [9] అనుసంఖ్యలచేత అంకితమైన సంవత్సరమున అనగా ౯౮౨ వ శకవర్షమున ఉత్తరాయణ సంక్రాంతినాడు కోలువర్తని విషయములోని అవరెంగ అను పేరుగల గ్రామమును చతుస్సీమావచ్ఛిన్నముగను, సజలస్థలముగను సర్వపీడావివర్జితముగను అనగా జలసహితముగను స్థలసహితముగను ఏవిధమైనపన్ను పర్యాయముల బాధలులేకుండగను చేసి ఆగ్రామమున విజయంచేసియున్న జలేశ్వరస్వామి అను పేరుగల దేవునికి భోగముచేసి అనగా దేవునికి చెల్లే గ్రామముగ ఏర్పాటుచేసి దానమొసంగబడినది. జలేశ్వరదేవునికి చేసిన యీదానమును తెలుపుటకే ఈశాసనము పుట్టినది. ఈగ్రామమును జలేశ్వరస్వామికి దానమొసంగు సందర్భముననే మరి యిరువురు గ్రామస్థులకు (1) ఎరయముడు అనువానికిని (2) మహాక్షశాలియు, స్వర్ణలోహకారకుడు అయిన వల్లేమోజునకును వృత్తులొసంగబడినవి. పంక్తులు 45 మొదలు 52 వఱకు దానముచేయబడిన గ్రామమునొక్క సరిహద్దులు తెలుపబడినవి. చిట్టచివర దానశా

14అనంతవర్మ చోడగంగ దేవుని కొర్ని శాసనము.

మహారాజశ్రీ గిడుగు వెంకటసీతాపతి గారు

ఈశాసనము అయిదు రేకులు గలది. ప్రతిరేకున్ను సుమారు 8¼ అంగుళములు పొడవుగాను, 4 అం. వెడల్పుగాను ఉన్నది. రేకులన్నిటికిన్ని ఎడమవైపు అంచుకు సుమారు ఒక అంగుళము దూరముగా రంధ్రములున్నవి. వాటిగుండా ఒకరాగి కడియము అమర్చబడి ఉన్నది. ఆకడియమునకు ఈఅయిదు రేకులున్ను వ్రేలాడుతున్నవి. కడియము చుట్టుకొలత 15½ అంగుళములు. కడియముకడ్డీ

సనములకు వ్రాయబడు మామూలు శ్లోకములు కలవు. [పం. 53-55) కడపటి రెండుపంక్తులలోను శాసనము వ్రాసిన వాని పేరు. శాసనమును చెక్కినవాని పేరు తెలుపబడినవి. శాసనమును వ్రాసిన యతడు మావురయకుమారుడైన దామోదరుడు. ఇతడు మహాకాయస్థుడనియు, సంధివిగ్రహిఅనియు తెలుపబడినాడు. సంధివిగ్రహి అనగా యుద్ధము ప్రకటించుట, సంధిసేయుట అనుకార్యములను బరిశీలించు మంత్రి). శాసనమును చెక్కినవాడు నూంకమోజు కొడుకైన వల్లేమోజు శ. 1003 నాటి అనంతవర్మ చోడగంగదేవుని కొర్ని శాసనమును వ్రాసినవారును చెక్కినవారును వీరలే ఎరయముడు అనువాని కిచ్చిన వృత్తి 'మాదరమనువర్తికము' అని శాసనమున చెప్పబడినది. ఇప్పుడు మనము 'మనోవతి' అను నదియే ఈ 'మనవర్తికము' అని నా యభిప్రాయము.

గ్రామమును దానమొసంగినది శకవర్షము 982 లో ఉత్తరాయణ సంక్రాంతినాడు అనగా ఈశాసనము క్రీ. శ. 1059-60 వ సంవత్సరము నాటిది అగును.

ఈశాసనమును చేర్కొనబడిన అవరెంగ, జల్మూరు, కుద్దాము మొదలగు గ్రామము లున్న యిప్పటి శ్రీకాకుళము తాలూకా (గంజాంజిల్లా) పూర్తిగనో, లేక కొంతభాగమో కోలువర్తనీ విషయమని ప్రాచీనకాలమున పేరొందియుండినట్లు చిక్కాలవలసశాసనమువలన దెలిసికొనియున్నాము. ఆనిర్ణయమునే యీశాసనము బలపఱుచుచున్నది. దానముచేయబడిన అవరెంగ అను గ్రామ మిప్పుడు అవలింగ అనుపేర బరగుచున్నది.

[అక్షయసం॥ వైశాఖమాసపు భారతినుండి]

---

చుట్టుకొలత ఒక అంగుళము. ఈకడియము తాలూకు రెండుకొనలున్న వలయాకారమున ఉన్న ఒక రాజముద్రికకు అంటివున్నవి. ఆ రాజముద్రిక 1¼ అం. ఎత్తుగ ఉన్నది. వలయాకారమున ఉన్న దాని అడుగుభాగము 7 అంగుళముల పరిధిగలది. రాజముద్రికయందు 1 1/2అం. ఎత్తుగల నందివిగ్రహమున్నది. ఆనంది విగ్రహమునకు నాలుగువైపులను శంఖము, చామరము మొదలయినవి చెక్కినారు.

ఈశాసనమునందలి భాష మొదటనుండి చివరవరకున్ను సంస్కృతము. లిపి ప్రాచీననాగరి లిపి.

---

## మూలము.



మొదటి రేకు; రెండవ వైపు.

1 ఓం. స్వస్తి శ్రీమతా మఖిలభువన వినుతనయ వినయదయాదానదాక్షిణ్య సత్య

2 శౌచశౌర్య ధైర్యాదిగుణరత్న పవిత్రికాణా మాత్రేయగోత్రాణాం

3 విమలవిచారాచారపుణ్యసలిల ప్రక్షాలితకలికాల కల్మషమషీ

4 ణాం మహామహేన్ద్రాచల శిఖరప్రతిష్ఠితస్య సచరాచరగురోః సకల

5 భువననిర్మాణైకసూత్రధారస్య శశాఙ్కచూడామణే ర్భగవతో

6 గోకర్ణస్వామినః ప్రసాదా త్సమాసాదితైక శఙ్ఖభేరీపఞ్చమహా

7 శబ్దధవలచ్ఛత్ర హేమచామరవరవృషభలాఞ్ఛనసముజ్వల సమస్తసామ్రా

8 జ్యమహిమ్నా మనేకసమరసఙ్ఘట్టసముపలబ్ధవిజయలక్ష్మీ సమాలి



రెండవ రేకు; మొదటి వైపు

## రెండవ రేకు: మొదటి పెడ.

9 ద్గతోత్తుఙ్గ భుజదణ్డమణ్డితానాం త్రికలిఙ్గమహీభు
జాం గఙ్గా

10 నా మన్వయ మలఙ్కరిష్ణో ర్విష్ణోరివ విక్ర
మాక్రాన్తధరామణ్డలస్య

11 గుణమహార్ణ్ణవమహారాజస్య పుత్రః॥౦॥ శ్రీ
వజ్రహస్తదేవ శ్చతుశ్చ

12 త్వారింశత మబ్దకాన్ క్షితి మరక్షీత్॥ తత్త
నయో గుణ్డమరాజా వ

13 ర్షత్రయ మపాలయత్॥ తదను తదనుజః కా
మార్ణ్ణవదేవః ప

14 ఞ్చత్రింశద్వర్షాణి॥తస్యానుజో వినయాదిత్యః
సమాస్త్రిస్రః

15 ॥తతః కామార్ణ్ణవతనయో వజ్రహస్తః రోహ
దగలిత గణ్డాన్ గ

16 జాన్ సహస్ర మర్థిభ్యః సమదాత్ సపఞ్చ
త్రింశత మబ్దకాన్



## రెండవ రేకు; రెండవ పెడ.

17 ॥తత స్తదగ్రసూనుః కామార్ణ్ణవదేవోర్ద్ధ స
మామ్॥తత స్తదనుజో

18 గుణ్డమహీపతి స్త్రీణి వర్షాణి॥తదను తస్య
ద్వైమాతుకో మధుకా

19 మార్ణ్ణవ ఏకోనవింశతివర్షాణి॥తతః కామా
ర్ణ్ణవాద్వైదు

20 మ్యాన్వయసముద్భవాయాం వినయమహాదేవ్యాం
జాతః శ్రీవజ్ర

21 హస్తదేవో యోదివః పతన్త మతిభీషణ మశ
నిం శస్త్రైర్భి

22 జఘాన స త్రయస్త్రింశత మబ్దకా నవని మపాల
యత్॥ తతస్తు తస్యా

23 త్మభవోరిమర్ద్దన స్సరాజరాజక్షితిపః క్షితిం
సమాః॥అ



మూడవ రేకు: మొదటి పెడ

24 రక్ష దృష్టా వరుణాలయాంబరా న్నిధి గ్గుణా శా న్నిధిపాలసన్నిభః॥

25 తతో రాజేన్ద్రచోలస్య తనయా రాజసున్దరీ రాజ్ఞస్తస్యాగ్రమహిషీ స

26 తీ సుత మసూయత॥ శాకాబ్దేనన్ద రన్ధ్రగ్రహ గణగణితే కుంభస

27 ంస్థే దినేశే శుక్లే పక్షే తృతీయాయుజి రవిజ దినే రేవతీ

28 భే నృయుగ్మే లగ్నే గంగాన్వయాంబుజ వన దినకృ ద్వి

29 శ్వ విశ్వంభరాయా శ్చక్రం సంరక్షితుం సద్గుణ నిధి రధిప శ్చో

30 డగఙ్గో భిషిక్తః॥౦॥ కలిఙ్గనగరా త్పరమ మాహేశ్వర



మూడవ రేకు: రెండవ పెడ.

మూడవరేకు, రెండవపెడ.

31 పరమభట్టారక మహారాజాధిరాజ త్రికలిఙ్గాధిపతిః శ్రీ

32 మదనన్తవర్మా చోడగఙ్గదేవః కుశలీ సమస్తామాత్య ప్రముఖ జ

33 నపదాన్సమాహూయ సమాజ్ఞాపయతి విదితమస్తు భవతాం। వం

34 హవత్తర్న్యాం ఖోన్నగ్రామ శ్చతుస్సీమావచ్ఛిన్న స్సజల

35 స్సర్వపీడా వివర్జిత మాచన్ద్రార్కక్షితి సమకాలం యా

36 వన్మాతాపిత్రో రాత్మనశ్చ పుణ్యయశోభివృద్ధయే॥ హరనయన

37 వియద్గగనచన్ద్రగణితే శాకాబ్దే మీనమాస కృష్ణప (చ)



నాలుగవరేకు; మొదటిపెడ.

38 ఞ్చమ్యా మాదిత్యవారే సామాన్యతో నానాగోత్రేభ్యః యజవయా

39 జనాధ్యయనాధ్యాపనదాన ప్రతిగ్రహ షట్కర్మ నిరతేభ్యః త్రి

40 శత బ్రాహ్మణేభ్యః ధారాపూర్వక మస్మాభిర్దత్త ఇతి॥ అస్య

41 గ్రామస్య సీమాలిఙ్గాని లిఖ్యన్తే। పూర్వతః ఖోన్నపాంబ

42 రవల్లి తో నైర్ఋతిగ్రామాణాం త్రికుటే; తో సేంగ గ్రామ వక్రిగ

43 త్రాల్లే। ఆగ్నేయాతః వల్మీకసహిత మరీచవృక్షః॥ తత్పశ్చిమ

44 తః ఈషత్ వక్రింగత్వా మరీచవృక్షపఙ్క్తిః తతః ఖోన్న తో



నాలుగవ రేకు; రెండవ పెడ.

45 నేజ్జిఖోల్లేర గ్రామాణాం త్రికూటే వల్మీకసహిత మరీచవృక్ష

46 ః॥ దక్షిణస్యాం। దిశి బృహద్వల్మీకః॥ తత్పశ్చిమ తః వనరాజికా

47 నైరృత్యాం ఖోన్న ఖోల్లేరతూలువు గ్రామాణాం త్రికూటే తనువాపి

48 కా గర్త్తాచ। పశ్చిమాయాం గర్త్తా॥ వాయవ్యతః ఖోన్న తూలువు గ్రా

49 రగ్రామాణాం గర్త్తాతీరత్రికూటం। ఉత్తరస్యాం తటాకద్వ

50 యసేతుసంధిః॥ ఈశాన్యతః ఖోన్న గారహాంబరవల్లి గ్రామా

51 ణాం తో నేజ్జిగర్త్తాతీరత్రికూటం॥ బహుభిర్వసుధా దత్తా రాజభి స్సగ

52 రాదిభిః॥యస్యయస్య యదా భూమి స్తస్య తస్య తదా ఫలం॥ స్వదత్తా మ్పర



అయిదవ రేకు; మొదటి పెడ.

53 దత్తాంవ్వా యో హరేత వసుంధరాం। స విష్ఠాయాం కృమి ర్భూత్వా పితృభి స్స

54 హ పచ్యతే॥మహాక్షాయస్థసన్ధి విగ్రహి మాపురయ సూనునా దామోదరే

55 ణ లిఖితం॥ మాహాక్షశాలివల్లేమోజే నోత్కీర్ణ్ణం తః

## తెలుగు తర్జుమా.

[పంక్తులు 1—11] ఓం. ప్రపంచమందంతటను ప్రాగద్తగన్న నయము, వినయము, దయ, దానము, దాక్షిణ్యము, సత్యము, శౌచము, శౌర్యము, ధైర్యము మొదలయిన గుణరత్నముల చేత పవిత్రమైనటువంటిన్ని, ఆత్రేయ గోత్రమందు పుట్టినటువంటిన్ని, నిర్మలమైన తలంపులు, ఆచారములు అనే పవిత్రజలముల చేత కలికాలకల్మషమనే మసిని కడిగివేసినటువంటిన్ని, మహామహేంద్రగిరిశిఖరమందు ప్రతిష్ఠితుడై, చరాచర ప్రపంచమునకు గురువుగాను సమస్తభువన నిర్మాణమునకు ముఖ్యసూత్రధారుడుగాను ఉండి, చంద్రశేఖరుడున్ను భగవంతుడున్ను ఐన గోకర్ణస్వామియొక్క అనుగ్రహమువల్ల ప్రాప్తమైన శంఖము, భేరి, పంచమహాశబ్దములు, తెల్లనిఛత్రము, బంగారు చామరము, శ్రేష్ఠమైన వృషభ చిహ్నము-వీటిచేత ప్రకాశిస్తూఉన్న సమస్తసామ్రాజ్యమహిమలున్ను కలిగినటువంటిన్ని, అనేక యుద్ధములసంఘర్షణవల్ల [తాము] పొందిన విజయలక్ష్మి కౌగిలించుకొన్న భుజదండముల చేత అలంకృతులయినటువంటిన్ని, త్రికలింగ మనే భూమిని అనుభవిస్తూ ఉన్నటువంటిన్ని, గంగులయొక్క వంశమును అలంకరించి, విక్రమము చేత విష్ణువవలె నే భూమండలమును ఆక్రమించిన గుణమహార్ణవ మహారాజుగారి పుత్రుడు, శ్రీవజ్రహస్తదేవుడు,

(పం11-16) శ్రీవజ్రహస్తదేవుడు 44 సంవత్సరములు రాజ్యమేలినాడు. అతని కుమారుడు, గుండమరాజు 3 సంవత్సరములు పరిపాలనము చేసినాడు. తర్వాత, అతని తమ్ముడు కామార్ణవదేవుడు 35 సంవత్సరములున్ను, పిమ్మట అతని తమ్ముడు, వినయాదిత్యుడు 3 సంవత్సరములున్ను (రాజ్యమేలినారు). తర్వాత కామార్ణవుని కుమారుడైన వజ్రహస్తుడు, మదగలితగండములు గల ఏనుగులను వేయింటిని అడిగినవారికి దానము చేసినవాడు, 35 సంవత్సరములు (రాజ్య మేలినాడు)

(పం.7-22) తర్వాత, అతని పెద్దకుమారుడు కామార్ణవదేవుడు అర్థసంవత్సరమున్ను, పిమ్మట అతని [కామార్ణవుని] తమ్ముడు, గుండమహీపతి 3 సంవత్సరములున్ను, ఆటుపిమ్మట అతని సవతితల్లి కుమారుడయిన మధుకామార్ణవుడు 19 సంవత్సరములున్ను రాజ్యమేలి[illegible] పిమ్మట [illegible]



మార్ణవునికి వైదుంబవంశోద్భవరాయెన వినయమహాదేవి వల్ల కలిగిన శ్రీవజ్రహస్తదేవుడు స్వర్గమునుండి అతిభయంకరముగా పడుతూఉన్నటువంటి పిడుగును ఖడ్గముతో ఖండించినవాడు, 33 సంవత్సరములు భూమిని పాలించినాడు.

[పం 22-24] పిమ్మట, అతని కుమారుడు, రాజరాజు అనే భూపాలుడు-శత్రువులను మర్దించినవాడు, సద్గుణములనిధి, కుబేరునివంటివాడు - సముద్రపరివృతమయిన భూమిని పరిపాలించినాడు.

(పం 25-26) పిమ్మట, రాజేంద్ర చోళుని కూతురైన రాజసుందరి అతనికి [రాజరాజుకు] పట్టపుదేవియై కుమారుని కనినది.

(పం. 26—30) శక 999 లో సూర్యుడు కుంభమందుండగా, శుక్లపక్షమి, తదియనాడు, శనివారమున, రేవతీనక్షత్రము రాగా, మిథునలగ్నమందు గంగవంశ పద్మవనమునకు సూర్యుడున్ను, సద్గుణములకు నిధిన్ని అయిన చోడగంగమహారాజు భూచక్రమును సంరక్షించుటకు రాజ్యాభిషిక్తుడయినాడు.

[పం.30-33] పరమమాహేశ్వరుడున్ను, పరమభట్టారకుడున్ను, మహారాజాధిరాజున్ను, త్రికలింగాధిపతిన్ని అయిన శ్రీమదనంతవర్మచోడ గంగదేవుడు కుశలియై సమస్తమయిన అమాత్యప్రముఖ జనపదులనున్ను పిలిపించి ఆజ్ఞాపించినాడు:—

"మీ కందరికీ తెలియవలసినది ఏమంటే:—

(పం 33-40) వరాహవర్తనియందున్న ఖోన్న గ్రామము, నాలుగువైపులను ఏర్పరచిన ఎల్లల మధ్యమందు అవిచ్ఛిన్నమై ఉన్నది. సమస్త జల సహితంగా, పన్నులు మొదలయిన బాధలు ఏమి లేకుండా చేసి, మాతలిదండ్రుల పుణ్యయశోభివృద్ధికొరకున్ను, మాపుణ్యయశోభివృద్ధికొరకున్ను, శక 1003 వర్షములుకాగా మీనమాసమందు బహుళపంచమీ ఆదివారమున యజనయాజనాధ్యయనాధ్యాపన దానప్రతిగ్రహషట్కర్మనిరతులైన నానాగోత్రముల బ్రాహ్మణులకు 300 మందికి ఆచంద్రార్కం [అనుభవించగలందులకు] ధారాపూర్వకంగా దానము చేసినాము."

(పం. 40-51) ఈగ్రామమునకు ఎల్లలు వ్రాస్తాము. తూర్పున, ఖోన్న హాంబరువల్లి తో నేంగిగ్రామము. [illegible] సంధిగా పోయే తోనేంగిగ్రామము

17]

పుంత(గోర్జ); ఆగ్నేయమందు, పుట్టతో కలిసియున్న మరీచవృక్షము; దానికి, పడమటివైపున కొంచెము వంకరగా గుత్తే మరీచవృక్షపంక్తి, దానిప్రక్కను ఖోన్న,తో నేంగి ఖోల్లేర గ్రామముల మూడింటికీ నడుమను పుట్టతో కలిసి ఉన్న మరీచవృక్షము; దక్షిణమందు, పెద్దపుట్ట; దానికి పడమటను, అడవులపంక్తి. నైరృతిని, ఖోన్న ఖోల్లేర తూలువు గ్రామముల మూడింటికిని నడుమను బందాను, పుంతాను. పడమటను, పుంత. వాయవ్యమందు, ఖోన్న తూలువు, గార గ్రామముల మూడింటి తాలూకు పుంత, ఏటి ఒడ్డున ముయ్యేలసంది. ఉత్తరమందు, రెండుతటాకముల నడుమనున్న గట్టు. ఈశాన్యమందు, ఖోన్న, గార, హాం బరవెల్లి గ్రామముల మూడింటికీ నడుమగాపోయే తోనేంగి పుంత. ఏటి ఒడ్డున ముయ్యేలసంది.

(పం. 51-54) సగరాదిరాజు లనేకులు భూదానము చేసినారు. భూమి ఏయేకాలములందు ఎవరెవరివశమై ఉంటుందో ఆయాకాలములందు వారివారికి తత్ఫలము లభ్యమవుతూ ఉంటుంది స్వదత్తమయినా, పరదత్తమయి నా, భూమిని ఎవడు హరిస్తాడో వాడు మలమందలి పురుగై తనపెద్దలతో కలిసి దగ్ధమవుతాడు.

[పం. 54-55] మహాభాయస్థుడున్ను సంధివిగ్రహి న్ని అయిన మావుగయ కుమారుడు దామోదరుడు వ్రాసినది. మహాక్షశాలి (అగసాలి) వల్లె మోజా చెక్కినది.

[క్రోధన సం॥ శ్రావణమాసపు భారతి సంచి.]

---

14 అనంతవర్మ చోడగంగ దేవుని కోర్ని శాసనము.

మ॥ శ్రీ గిడుగు వెంకటశీతాపతిగారు బి ఏ,ఎల్.టి.

ఈశాసనము కూడా అయిదు రేకులు గలదే; కాని దీనిరేకులు చాల పెద్దవి. ప్రతిరేకున్ను సుమారు 10 న్నర అం. పొడువుగాను, 6 అం. వెడల్పుగాను ఉన్నది. ఈ రేకుల కమర్చిన కడియము సుమారు 17 అం. చుట్టుకొలత గలది; కడియము కడ్డీ 1 1/4 అం. వళము గలిగి గుండ్రముగా నున్నది. కడియముపై నున్న రాజముద్రిక 1 3/4 అం. ఎత్తైనది. వలయాకారమున ఉన్న దాని అడుగు భాగము 7 న్నర అం. పరిధిగలది. దీని రాజముద్రిక మొదటి శాసనము తాలూకు రాజముద్రికను పోలియున్నది.

ఈశాసనమందలి లిపి ప్రాచీనకన్నడ-తెలుగులిపి; ఇండియన్ అంటిక్వరీ సం 18 లో ప్రకటితమైన అనంత వర్మచోడ గంగదేవుని శాసనములో శక. 1040 నాటి శాసనమందలి లిపిని పోలి ఉన్నది. భాష మొదటినుండి చివరవరకున్ను సంస్కృతమే. శాసనమంతా 138 పంక్తుల గ్రంధము; రెండు వంతులు శ్లోకములున్ను, ఒకవంతు వచనమున్ను గలది. ఆకాలమున కళింగదేశమందలి ప్రజల భాషమాత్రము తెలుగే అయియుండుననుటకు ఆధారము లనేకములు ఉన్నవి. ఇండియన్ అంటిక్వరి సం. 18లో ప్రకటితమైన శక.1040 నాటి శాసనమునకున్ను, శక 1034లో పుట్టిన ఈశాసనమునకున్ను గంగవంశపురాజుల చరిత్ర వంశోత్పత్తి, వంశానుక్రమము, ప్రశస్తి మొదలయిన విషయములుగల భాగము సమానముగా నున్నది.

---

## మూలము.

### మొదటి శ్లోకః రెండవ వైపు.



1 ఓంలక్ష్మీనివే (వ్య) ముదురాజకలంక కాంతి బా
హాచతుష్టయచణం వపు రావధానః పాదు

2 ర్భభూవ భువనత్రితయం విధత్సు ర్యశ్వప్ర
నూతిజఠరో భగవా ననంతః। అవ్నాభీవలి

3 నాద్బభూవ భువనప్రారంభ దీక్షారతో బ్రహ్మే
వేదపరంపరాంచరితదధ్వక్తై ర్శ్రుతుర్బిస్తుతః ప్రా

4 జాపత్యధురా(రూ)ఢమహాసా వత్రిమ్మునీనాం
పతిర్బు జ్జాతస్సర్వజనీననిత్యతపసాంవాతో

5 పుష్పాంగవ। అత్రేః పుత్రో బభూవ త్రిపురహర
జటాజూట నేపథ్యరత్నం నేత్రవ్యాపార దేశస్మరచరిత

6 మహో నాటికా సూత్రధారః దృష్టాంతో దా(క్షిణా)
క్యాముఖ మాకురరుచాం శర్వరీజీవితేశ స్త్రైలోక్యానం

7 దకందో గగనతలమహాంభోధిశం[ఖ]శశాంకః తతో
జగత్రాపభిషజ్జిత త్విషశ్శుభగ్రహో భూ

8 ద్విబుధాగ్రణిర్బుధః పురూరవ। స్తత్తనయో
యదుల్లసద్భుజే భుజిష్యార్ణవ మేఖలాబభౌ

9 తస్మాదాయు శ్శుభంయు స్త్రిభువనవినుతో జ
న్మ లేభే తదీయః పుత్రో భూజ్జైత్ర బాహుర్నహు

10 షనరపతి ర్బూభృతామగ్రగణ్యః యఃపృ
థ్వ్యామేకపత్న్యామనుభవవిముఖో భూరిజాతప్రజాయా

11 ంస్వర్గేశ్వర్యం ఖణ్డితేంద్రం ప్రణయపరవశః
పౌరుషేణాన్వభుఙ్త్త। తతో యయాతిర్విజితాభియా

12 తిర్జజ్ఞే తతస్తుర్వసురుర్వరేశః సపూర్వశ
గీర్వాణగురోర్గరిమ్నా మాతామహస్యైరనిహప్రవృద్ధః

13 అపుత్రత్వంప్రాప్తస్సుచిర మతిభిన్నోస్య పప్ర-
పన్నగంగా మారాధ్యాస్లే యతగతిరా

14 రాధ్య వరదాం అజేయం గాంగేయం సుత మ
లభ తారభ్యచ తదాక్రమస్తద్వంశ్యానా

15 ంభువి జయతి గంగాన్వయ ఇతి ఆస్యాసీత్తన
యో విరోచనప్రభుర్వైరిగిరిహో

16 స్తాచలః క్షోణీనాథకిరీటపతి మకరీలగ్నాంఘ్రి
రేణుర్వీరః లక్ష్మీవా

రెండవ రేకు; మొదటివైపు



17 గ్వనితా మహాకులనదీ సంవేద్య సుద్యోగినం
సంవేద్యం సమజీజన త్సనృపతిర్గ్గాంగా న్వయో
18 (సకన్ సంవేద్యతో గుణిరివాజనినామధ్యే ...స్
భూపాలమాలిమకుటైరుపపాలనీయః
19 ప్రసాదదోషరహితస్సబభూవ పుత్రీ యత్సం
పదాన్నిధిరజాయతచత్త సేనః। తస్యోర్వ్వీ
20 శ్వరమాలిమణ్డనమణే రాసీదసాధారణాం బిభ్రా
ణో నృపతి శ్రియంప్రియసుతస్సామ్యోతిర
21 మ్యాకృతిః తస్మాదప్యదపాది మోదిత జగచ్ఛ
కోరింఋనక్తస్తతః సారాంగోభవ ద న్యరాడ్గజఘటాపాత
22 క్రియాపాకలః। తస్మాచ్చితారింగదో భూత్క్షి
తితలవలయే రాజశబ్దైకవాచ్య స్సానుస్సారధ్వ జోస్యా
భవద
23 ఖిలభువా మధిపత్య పరిచూతిః ధర్మ్మాఖ్యస్తత
సూజో నృపనయనపదవీ పాంథముఖ్యోవిరేజే
24 బభారిజాపత్యా మస్య క్షితిజయపరవానేకధ
న్వాపరీక్షిత్ సమహీపతిస్సుత
25 మవాపమానినం జయసేనమన్యనృప దర్ప్పశాత
నం అథవత్సుతోస్యజయ

26 నేసంజ్ఞితః ప్రథయన్ దిశా సిత దుకూలితంయశః
జితవీర్య్యామ
27 సావజీజన త్సచ భూపాలవృషం వృషధ్వజం
సహాశక్తి మలంఘ్య శాసన
28 ంవిజిగీషుం సువినోధిభీషణం తస్యపరిగల్భస్తన
యో బభూవ క్షితీశమార్గ్గాచర
29 ణపరిగల్భః యఃఖడ్గధారాజలధౌతవైరి నారీ
కపోలస్థలపత్రభంగః
3 ఆసీ దేక సితాతపత్రతిలకక్షోణీ భృదస్యాత్మజో
శ్రీవనితా స్వయం
31 వృతపతి ర్దేవ స్సకోలాహలః నిర్మ్మాయో
జ్జితగంగవాడివిషయే కోలా
32 హలాఖ్యంపురం యశ్చక్రే సురసద్మవీక్షణ రస
ప్రత్యూహఅర్ణ్ణం హరే
33 ఃతత్సుతోభృతశంసన యష్టి గ్గామరక్ష దప
వర్జ్జితచా ర్యం

రెండవ రేకు: రెండవ పెడ



34 శాస(న)ప్రథితపాళవిగ్రేయా మేక ఏవ సవిరోచన
సంజ్ఞః గతేషుతిషు నరేంద్రాణాం కోలాహలపురీభుజాం
35 [ఏకాసీ]త్యాం చ తద్వంశ్యో వీరసింహోభవ
న్నృపః చోళాం శ్చాలయత శ్చ్యమాచలవతః పాణ్డ్యాన్
భ్రువా భుగ్నయా
36 హుంకారేణ చసప్తకోంకణపతీ న్నైశ్యకా(ర)
తః కేరలాన్ అంతఃకోపకఘూర్ణ్ణమానశిరసాకర్ణ్ణాట
లాటేశ్వరా నస్యో
37 (న్మత్త?) కృపాణ వీక్షణధృతిం కేవాయయు
ర్బ్బాహుభృతః జిత్వా బాహుబలేనోర్వ్వీంవీరసింహస్స భూ
పతి స్వతిక్రియాన
38 మఖిహోత్రైర్వ్వి జిగ్యేసద్మ నాకినాం తస్యకా
మార్ణ్ణవస్సూనుర్ద్దాన్ నార్ణ్ణవగుణార్ణ్ణవో మారసి
39 ంహఇతిఖ్యాతా వజ్రహస్తాఖ్యపంచమః కామా
ర్ణ్ణవఃపిత్రృభ్రాతురసహిష్ణోఃకులో
40 ద్వహః శక్తోపిరాజ్యహరణేజహౌ జేశ న్నతు
క్రమం చతుబ్భిరనుజై ర్బ్బిందన్న రే
41 ంద్రా నాహ వోత్సుకాన్ దంతైర్ద్దైత్యానివేం
ద్రేభస్స్రప్రాయాద్వా సపీందిశం। అ(థ)వ
42 న్యేభదా (నా)వాద్వగుణీకృతని(ర్ఝ)రంవిలి
ఖితంన్న భశ్శృంగైర్మ్మహేంద్రం ప్రవరగోహాసతిత్రతచ
43 సకలసురాసురసిద్ధసాధ్యవరార్ద్ధ్వ కిరీటకోటి
ఘృష్టసుసృణలచరణపీఠ మారాధ్య గో
44 కర్ణ్ణస్వామిన మస్య ప్రసాదాసాదితధవలచ్ఛ
త్ర చామరసామజధ్వజ వృషభలాంఛనపింఛాంచి
45 తకుంతనికరమకరతోరణ హుడుక్కాహళైక
శంఖాదిరాజ్యోచితైరుపశోభమానస్సాత్యాస్య
46 హేంద్రఇవ మహేంద్రాచలశిఖరా దవతీర్య
యుధిష్ఠిరఇవ చతుబ్భి రనుజైరనుగ
47 మ్యమానస్సమరశిరసి శబరాదిత్య న్నిహత్యకా
మార్ణ్ణవః కలింగానగ్రహీత్ తస్య
48 చ విజితసకలనృపతిపుర మపహసితసురేంద్రపు
రం దంతాపురన్నామ న
49 గరీ రాజధా న్యాసీత్।అథ దానార్ణ్ణవ
మనుజం కంఠికాబంధురకంఠం వి

మూడవ రేకు: మొదటి పెడ



50 ధాయ గుణార్ణవాయాంబవాడి విషయం మార సింహాయ సో(దా)మ(ణ్డ)లం ప్రజహస్తాయ

51 క (ంట) కవర్త్తనీమదాత్ ఏవంచ క్రమేణ షట్త్రింశద్వర్షాన్ కలింగా నపాలయత్। తస్య చక్రి

52 (మ) తా మశేషభువనసంస్తూయమాన విమలయశసా మకుల భుజకృపాణాకృష్టవి

53 జయలక్ష్మీసమాలింగితో త్తుంగవక్షస్థలానాం చరణకలకాంతి సంధ్యావదన్త హిర్జితసమ

54 స్త రపతికదంబకానా మనవరత రాజ్యవినోదాపహసితమహేంద్రాణామ్మహేంద్రాచలశిఖర

55 ప్రతిష్ఠతస్య సకలభువన నిర్మ్మాణైకసూత్రధారస్య చరాచరగురో ర్భగవతో గోకర్ణ్ణస్వామినః సమా

56 రాధన లబ్ధాఖిలమనోరథానా మాత్రేయగోత్రాణాం గంగానాం కులమలంకరిష్ణో ర్వ్విష్ణోరివ

57 విక్రమాక్రాంత సకల మహీమణ్డలస్య కామార్ణ్ణవస్యాను జో దానార్ణ్ణవ శ్చత్వారింశతమబ్దకాన్

58 రాజ్యమకార్షీత్। తత్సూనో ర్ద్వితీయకామార్ణ్ణవః పంచాశద్వర్షాన్మహీ [మణ్డల]

59 మమణ్డయత్। తస్య తిరస్కృతత్రివిష్టపం నగరన్నామ పురమాసీత్ తస్మిన్సో

60 పి మధూకవృక్షజననా దీశస్య లింగాకృతేః కృత్వా వ్యాంమధుకేశ ఇత్యరచయ త్ప్రా

61 సాద మభ్రంలిహంయస్యాగ్రోర్ధ్వ్వాని చిత్రపత్రలతికా శ్చిత్రాణివాపశ్యతాం సౌధా

62 న్యంబరవర్త్తినాం ... వేమ్యానం విమానారుచిః తత్తనయోరణార్ణ్ణవః పంచవ

63 ర్షాన్మహీ మపాలయత్। తత్సూను ర్ద్వితీయోవజ్రహస్తః పంచదశసమాః క్షమామర

34 క్షత్ తస్యానుజస్తృతీయః కామార్ణ్ణవో ర్ణ్ణవమే ఖలా మేకోనవింశతి సం

65 వత్సరాన్ (స) మవర్ద్ధయత్। తస్యవర్ణ్ణనే శ్లోకః వై చిత్ర్యంద్పృథతాచ సౌష్ఠ

66 వమితి (త్రే) ధా ధనుఃకర్మ్మణాం సోమా త్కార్ణ్ణస్య యయో ర్ద్ధ ధానమధురం కామా

67 ర్ణ్ణవో [రా]ఘవః విద్యాదైకశరేణ సప్తసు భటాన్ కళ్జిఘాంసూన్వనే త

68 త్సాంఖ్యావపరస్త రూ నితి పృథక్కృత్త్వా వ్యరీవృత్య తే తత్సుతో గుణార్ణ్ణ

మూడవ రేకు: రెండవ వైపు



69 ఏ స్సప్త వింశతి మబ్దా నబ్ధిరశనాంపశమశైషీ
తోత వాత్మజః పోశాంపకః పంచదశవ

70 త్సరాణా మహీన్ని స్సవత్నా మకాషీఱత్ తత స్త
ద్భ్రాతు స్సుతః కళింగలాంకుశో ద్వాదశవత్సరాన్

71 కళింగా నలంచకార। తతస్తస్య పితృభ్రాతా సప్త
వర్షాణి గుణ్డమరాజో మహీము

72 ణ్డలమణ్డనో బభూవ। తస్యానుజ శ్చతుర్థః కా
మార్ణవః పంచవింశతిం వర్షాణ్ వసుంధరా

73 మనుబభూవ। తయోః కనీయా న్వినయాదిత్యో
పరాఖ్యియం ధరిత్రీ మత్రాయత। తతస్త జ్యేష్ఠస్య

74 కామార్ణవస్య సుత శ్చతుర్థో వజ్రహస్తః
పంచత్రింశత మబ్దకాన్ మహీమిభమదజలధా

75 రాభి రభ్యషించత్ తస్యవర్ణనే శ్లోకః। ఆర్థి
థ్యః కరిణాంసహస్ర మతులంకాలి (౦) గ (కాంతార)

76 జం యద్దత్తం సురభీచకార కరటస్రి స్యందిదా
నైర్దిశః తద్దంతైరివ పాణ్డురామ

77 లోచా దానైరివామోదినా వ్యాప్తాని త్రిజగం
తి దివ్యయశసా శ్రీవజ్రహస్త [ప్రభోః)

78 తతస్తత్సుతః పంచమకామార్ణవోర్ధన్ సమ
ఖిలాం పాలయమాస। తతస్తదనుజో

79 ద్వితీయో గుణ్డమరాజ స్త్రీణివర్షాణి ధరా
ధురంధరో బభూవ। తస్య ద్వైమాతరో భ్రాతా వష్ఠో

80 మధుకామార్ణవ ఏకోనవింశతివర్షాణి విశాం
పతి రభూత్। తత స్తదీయనందనో వజ్ర

81 హస్త స్త్రయత్రింశత మబ్దకా న్మహీముదవ
హత్ తస్యవర్ణనే శ్లోకాః। వ్యాప్తే గంగకులో త్తమస్య

82 యశసా దిక్చక్రవాలే శశిప్రద్యోతామలినేన
యస్యాభువన ప్రహ్లాదనసంపాదినా సిందూరై

83 రతిసాంద్రపంక పటలైః కుంభస్థలీపట్టకే స్వార్థం
పంతి పునః పునశ్చ హరితా వా

84 ధోరణా వారణాన్। అనురాగేణ గుణినో
యస్యవక్త్రో ముఖాబ్జయోః అసీ నేశ్రీ

85 సరస్వత్యా వనుకూలే విరాజితః। వనామలః
కేవలమర్థినో పి సవజ్రహస్త

నాలుగవ రేకు; మొదటి వైపు.



86 స్త్రీ (కలింగవా) ధః కోపజ్రిహస్తాదపరం పృథివ్యాం। సజ్రిం పతద్వారయితుం సమర్థాశితస్స

87 తో (రాజరాజ)ః క్షమా మరక్ష దష్టసంవత్స రాన్ । తస్యవణ్ణ్నే శ్లోకా॥ సరాజరాజఃప్రిథమ

88 ంపయ్రశ్రీ రాఃపతి బ్బభూవ ద్రవిలావహోత్సవే విరాజమానా మథ రాజసుందరీముదూ

89 ఢవా [న్] శ్చో [డ] మహీభుజాత్మజాంత్య క్త్వా వేంగిం సపదిపరిజా మోద యే ద్యామివాన్యాంచోడవ్యా

90 జే మహతి విజయాదిత్య మద్ధా మిమంక్షుం ఆప న్నానాం పరమశరణం రాజంజో విచిత్రిం ల

91 క్ష్మీ భాజం పుచిర మకరోత్పశ్చిమాయాం దిశా యాం తస్యాసీదగ్రిసూనుః పృథులనిజభు

92 జా విక్రిమార్జితార్ధ స్సత్యత్యాగైకసీమా విమలతర యశశ్చంద్రికాధాతలోకః వాఙుల్లంఘీ

93 ప్రితాపప్రభవతరనిధి ర్భాగ్య సౌభాగ్య రాశిః శ్రోణీపారిజాధినాధస్సకల రిపుమ

94 నోభంగదశ్చోడగంగ। శాకాబ్దేనంద రంధ్రిగ్రి హాగణగణితే కుంభసంస్థే

95 నేశే శుక్లేతత్పే తృతీయాయుజి రవిజదినే రేవ తీభే నృయుగ్మే లగ్నే గంగాన్వవాయా

96 ంబుజవనదినకృ ద్విశ్వ విశ్వంభరాయా శ్చక్రం సంరక్షితుం సద్గుణనిధి రధిప శ్చోడగంగో భి

97 షిక్త ః। భీమంవాహ మహోర్మ్మిభిర్బ్బహుబృహ న్నాగేంద్రినక్రాకులం నానాశస్త్ర ఫణీంద్రబృందగహ

98 నంకోద్రిధస్ఫారద్బాడబం సేనాబ్ధిం ద్విషతాం ప్రిమథ్య మహతా దోర్మ్మందరేణాగ్రిహీల్లక్ష్మీ కీర్తి

99 సుధాంచ విశ్వవిబుధానందాయ శార్ఙ్గీవయః వీర్చ్ఛ్బ్భజదణ్డయుగ్మకలితాయస్యా

100 రిదపూర్వచ్ఛిదస్తంభద్వంద్వనిరుంధ్రి తైరశర ణీసాదృశ్యమాశ్లిష్య తేయశ్శ్వేదద్విషరయాంతి

101 కపరిణమునః శ్రోణీభృత్తామ్మాలయప్రాన్ఛయ త్పన్నయు గానుసారిమఘుపశ్రేణిశ్రియ

102 ంబిభ్రితి పూర్వాస్యాం దిశి పూర్వమూర్కు లపతిం రాజ్యేనిధాయాద్భుతం, ధశ్చ్రిత్పశ్చిమ

నాలుగవ రేకు; రెండవ పెడ.



103 దిక్తటే విఘటితం వేంగీశ మన్యైతయోః లక్ష్మీ

ఖండనమాలికామివజయః శ్రీ

104 తోరణస్తంభయో ర్బద్ధ్నాతిస్మ సమస్తకీ

ర్తివిభవ శ్రీగంగచూడామణిః॥ స

105 శ్రీమదనంతవర్మా మహారాజో రాజాధిరాజో

రాజపరమేశ్వర పరమభట్టారకః ॥

106 పరమమహేశ్వరః పరమవైష్ణవః పరమబ్ర

హ్మణ్యో మాతాపితృపాదానుధ్యాత శ్రీచో

107 డగంగదేవః వరాహవర్తనివిషయే వాసినో

రాష్ట్రకూటప్రముఖాన్ కుటుంబిన స్సర్వాన్

108 సమాహూయ పురోహితామాత్యయువరాజసంధి

విగ్రహిదౌవారికప్రముఖన

109 రజనసమక్షం నిత్థ మాజ్ఞాపయతి విదితమస్తు వో

యథా। భవద్విషయే ఖోన్నగ్రా

110 మః ముణ్డపలుబాలుగ్రామం గ్రామసీకృత్వా

చతుస్సీమావచ్ఛిన్నస్స జలస్థలస్సర్వ

111 పీడావివర్జిత మాచంద్రార్కక్షితిసమకా

లం యావ్మాతాపిత్రో రాత్మనశ్చ పుణ్యాయ

112 శోభివృద్ధయే పారనయనవి యుగ్గగనచంద్రగణి

తేషు శకవత్సరేషు మీనమా

113 సకృష్ణపంచమ్యా మాదిత్యవారే సామాన్యతో

నానాగోత్రేభ్యోసధ్యయనాధ్యాపనయజనయా

114 జనదాన ప్రతిగ్రహషట్కర్మనిరతేభ్యస్త్రిం

శద్బ్రాహ్మణేభ్యోధారాపూర్వకం సంమత్వా తామహేనవ

115 బ్రహస్తదేవేన దత్తం।తత్రగారగ్రామగృహీత

ముణ్డపలుగ్రామస్య ప్రతిక్షేత్రిత్వేన తూ

116 లుప్రగ్రామా దాహృత్యాష్టోత్తరాశీతిపరిమితం

క్షేత్రం తేభ్యః ఖోన్నగ్రామనివాసిబ్రా

117 హ్మణేభ్యః వేదగుణవియచ్చంద్రగణితేషుశకవ

త్సరే షూత్తరాయణనిమి

అయిదవ రేకు; మొదటి వైపు.



118 త్తే ధారాపూర్వక మస్మాభిర్దత్తమితి । అ
స్య క్షేత్రస్య ప్రతిక్షేత్రేణ సార్ద్ధం సీమాలింగాని

119 పూర్వతః ఖోన్న ఓంబర వేల్లితో నేంగి గ్రా
మాణాం త్రికూటే తో నేంగిగ్రామ వక్రగర్త్తా । ఆగ్నే

120 య్యాం వల్మీకసహితమరిచవృక్షః తత్పశ్చిమతః
ఈషద్వక్రం గత్వా మరిచవృక్షపఙ్క్తి

121 తతః ఖోన్నతో నేంగిఖోల్లిర గ్రామాణాం త్రి
కూటే వల్మీకసహితమరిచవృక్షః । ద

122 క్షిణస్యాం దిశి బృహద్వల్మీకః । తత్పశ్చిమతః
వనరాజికాః తతో గర్త్తాముల్లంఘ్య

123 స్థాపితశిలా । తతః క్రమేణ స్థాపితం శిలాత్రి
యం । నైరృత్యాం దిశి స్థాపితశిలా

124 తదుత్తరతః స్థాపితశిలా । తతరణిదలనేతోరథ
స్త్రింత్రిణీవృక్షసమీపే

125 స్థాపితశిలా । తతస్తటాక ప్రవిష్టగర్త్తా ము
ఖం । తతో గర్త్తాతీరే స్థాపితశిలా

126 తతో గర్త్తైవ । వాయవ్యదిశాయాం గర్త్తా ద్వ
యసంధా తింత్రిణీవృక్ష

127 సమీపే స్థాపితశిలా । తతో గర్త్తానుసారేణ
ప్రాచీం దిశం కించిద్వక్రం గత్వా

128 తాం గర్త్తా ముల్లంఘ్యోత్తరతో గత్వా ఖో
న్నతూలవుగార గ్రామాణాం త్రికూటే గర్త్తాద్వ

129 యమధ్యస్థాపితశిలా । ఉత్తరస్యాం దిశి తటాక
ద్వయసేతుసంధిః ఈశానదిశా

130 యాం ఖోన్న గారఓంబర వేల్లి గ్రామాణాం
తో నేంగిగర్త్తాతీరత్రికూటః । అ

131 స్యోపరి న కేనచిద్బాధః కర్త్తవ్యః తథాహి
వ్యాసేన భగవతోక్తం । బహుభిర్వసు

132 ధా దత్తా రాజభిస్సగరాదిభి ర్యస్య యస్య
యదా భూమి స్తస్య తస్య తదా

అయిదవ రేకు: రెండవ వెడ.



133 ఫలం స్వదత్తాం పరదత్తాంవా యత్నాద్రక్ష
యుధిష్ఠిర మహీం మహిమతాం శ్రేష్ఠ దా

134 నాచ్ఛ్రేయోనుపాలనం గామేకాంస్వర్ణ
మేకంవా భూమేరప్యేకమంగులం హ

135 రన్నరక మాప్నోతి యావదాభూతసంప్లవం।
స్వదత్తాం పరదత్తాం వాయో హరేత వ

136 సుంధరాం షష్ఠిం వర్షసహస్రాణివిష్ఠాయాం
జాయతే క్రిమి రితికర్త్తా కావ్యస్య శా

137 సనాధికారి గాతవేదిభట్టః। లేఖకోవల్లేనాచా
ర్యసుతోబట్టేనాచా

138 ర్యః॥

---

## తెలుగు తర్జుమా

---

(పం. 1-2) ఓం లక్ష్మి సేవింపదగినవాడున్ను, చంద్రకళంకమువంటి కాంతిగలవాడున్ను, నాలుగు బాహువులతో కూడిఉన్న శరీరము ధరించినవాడున్ను, ముల్లోకములను సృజింపగోరినవాడున్ను, విశ్వమునకు జన్మస్థానమైన గర్భముగలవాడున్ను, భగవంతుడున్ను అయిన అనంతుడు (విష్ణువు) ఉద్భవించెను. (2-3) అతని నాభికమలమునుండి భువనముల ఆరంభదీక్షయందు భక్తిగలవాడున్ను, నాలుగు ముఖములందున్న వేదసముదాయమును ధరించినవాడున్ను అయిన బ్రహ్మపుట్టెను. (3-5) అతనికి, సృష్టికి సంబంధించిన భారముచే అధిరూఢమైన తేజస్సుగల మునులలో సమర్థుడయినటువంటిన్ని, సర్వజనహితములున్ను, నిత్యములున్ను అయిన తపస్సులయొక్క సముదాయమువలెనే ఉన్నటువంటిన్ని అత్రి పుట్టెను. (5-7) ఆ అత్రికి, ఈశ్వరుని జటాజూటమున కలంకారరత్నమై నేత్రవ్యాపారదేశమందైన మన్మథచరిత్రమనే మహానాటికకు సూత్రధారుడయినటువంటిన్ని, దక్షిణస్త్రీల ముఖముకుర కాంతులకు దృష్టాంతమైనటువంటిన్ని, రాత్రికి నాయకుడయినటువంటిన్ని, ముల్లోకములందలి ఆనందమునకును మూలమైనటువంటిన్ని గగనతలమనే సముద్రమునకు శంఖము అయినటువంటిన్ని చంద్రుడు పుత్రుడయ్యెను. [7-8] అతనికి, జగత్తాపములకు దివ్యౌషధమయినటువంటిన్ని, దేవతలలో శ్రేష్ఠుడైనటువంటిన్ని బుధుడు అనే శుభగ్రహము పుట్టెను [8] అతనికి, ఎవరు ప్రకాశమానమైన భుజమందు భూమి భోగినిఅయి ప్రకాశించెనో అట్టి పురూరవుడు పుత్రుడయ్యెను. (9) అతనికి, శుభంకరుడున్ను, త్రిభువన వినుతుడున్ను అయిన ఆయువు పుట్టెను. [9-11] అతని పుత్రుడు నహుషుడు; జయశీలమైన బాహువులు గలవాడు; రాజులలో అగ్రగణ్యుడు; అధిక ప్రజాసంపత్తి గలిగి తనను ఏకపత్నియై ఉన్న భూదేవియందు అనుభవవిముఖుడయి, ఇంద్రుని వలపకున్న స్వర్గమనే వేశ్యను ప్రేమపరవశుడై

శౌర్యముచే అనుభవించినవాడు. (అనగా ఇంద్రలోకమేలెను.) (11-12) అతనికి యయాతి పుట్టెను; (ఆయయాతి) శత్రువులను జయించినవాడు. (12) అతనికి, తుర్వసు అనే రాజు పుట్టెను; అతడు రాక్షసులకు గురువున్ను, తనకు మాతామహుడున్ను, అయిన శుక్రునియొక్క కూర్మిచేత (అనుక్రిని) వక్షస్స్థలమందు వృద్ధిపొందెను. (13-14) అతడు చిరకాలము సంతానములేకపోవుటచేత అతి ఖిన్నుడై నియతిపూని, ఆరాధ్యయు, వరదయు అయిన గంగాదేవిని ఆరాధించి, అజేయుడయిన గాంగేయుడను పుత్రుని కనెను. (14-15) అది మొదలు ఆ వంశీయులకు గంగాన్వయమనే పేరు భూమియందు ప్రకాశించినది. (15-16) అతనికి, శత్రువులనే గ్రహములకు అస్తాద్రి అయినవాడున్ను, రాజుల కిరీటములందలి మకరికా పత్రములకు తగులుకొన్న పాదధూళి సముదాయము కలవాడున్ను, అయిన విరోచనుడు పుత్రుడయ్యెను. (16-18) అతనికి, గంగాన్వయశ్రేష్ఠుడున్ను లక్ష్మీ సరస్వతీ గంగాదేవులచేత సంవేద్యుడును, ఉద్యోగిన్ని అయిన సంవేద్యుడనే కుమారుడు పుట్టెను. (18) ఆసంవేద్యునకు, రత్నమువంటివాడున్ను, భూపాలమౌళి మకుటములచే లాలనచేయదగినవాడున్ను, అయిన భాస్వంతుడు పుట్టెను. (19) భయాదిదోషరహితుడైన ఆభాస్వంతుడు, సంపదలకు నిధియైన దత్తసేనుడు తనకుపుట్టుటచేత, పుత్రవంతుడయ్యెను. (19-21) రాజులయొక్క కిరీటములకు మాణిక్యమయిన ఆదత్తసేనునకు అసాధారణమైన రాజ్యలక్ష్మిని భరించువాడున్ను, అతిరమ్యమయిన ఆకృతిగలవాడున్ను అయిన సౌమ్యుడు ప్రియసుతుడయ్యెను. (21) అతనికి, జగచ్చక్రమును సంతోషపెట్టిన అంశుదత్తుడు పుట్టెను. (21-22) అతనికి, శత్రురాజులనే ఏనుగుల సముదాయమును పడగొట్టుటలో పాకలము(అనేరోగము) వంటివాడయిన సారంగుడు పుట్టెను. (22) అతనికి, భూమండలమందు రాజశబ్దమునకు ముఖ్యవాచ్యుడయిన చిత్రాంగదుడు కుమారుడయ్యెను. (22-23) అతనికి, సమస్తభూములయొక్క ఆధిపత్యమునకు కారణమైన సారధ్వజుడు అనే కుమారుడు పుట్టెను. (23) అతని పుత్రుడయిన ధర్మాసి రాజనీతిమార్గమున పోయే బాటసారులలో ముఖ్యుడయి ప్రకాశించెను. (24) అతని కుమారుడయిన పరీక్షిత్తు భూమినిజయించుటయందు ఆశక్తిగలవాడున్ను ఏకధనుర్ధరుడున్ను అయి ప్రకాశించెను. (24-25) ఆ మహీపతి, మానవంతుడున్ను ఇతర రాజుల దర్పమును నశింపజేయువాడున్ను అయిన జయసేనుని కనెను. [25-26] ఆతనికి దిక్కులకు తెల్లనిబట్టగా ఉన్న తన కీర్తిని విస్తరింపజేసుకొన్న (రెండవ) జయసేనుడనే పేరుగల పుత్రుడు పుట్టెను. (26-28) అతడు, పరాక్రమశాలిన్ని రాజశ్రేష్ఠుడున్ను శక్తివంతుడున్ను, అలంఘ్యశాసనుడున్ను, జయశీలుడున్ను, తన విరోధులకు భయంకరుడున్ను అయిన వృషధ్వజుని కనెను. [28-29] అతనికి ప్రగల్భుడు రాజధర్మమును ఆచరించుటయందు ప్రగల్భుడును కత్తియొక్క అంచు అనే నీటితో శత్రుభార్యల గండస్థలములందలి మకరికాపత్రరచనను కడిగివేసినవాడున్ను అయ్యెను. (30-32) అతనికి, ఏకచ్ఛత్రాధిపత్యముగల రాజతిలకమున్ను స్వయముగా వలచివచ్చిన వీరలక్ష్మి అనే వనితకు భర్తయున్ను అయిన కోలాహలుడు కుమారుడై జన్మించెను; అతడు (ఆకోలాహలుడు) గంగవాడి విషయమందు కోలాహలమనే పేరుగల పురమును నిర్మించి దేవేంద్రుని నేత్రములకు సురసద్మవీక్షణరసమును అనుభవించుటలో విఘ్నము కలిగించెను. [33-34] అతని కుమారుడు, విరోచనుడు అనే పేరుగలవాడు, ధనుర్దండమును ధరించి, చోరత్వములొలగించి శాసనమనే ప్రసిద్ధమయిన పాశమునకు విధేయురాలైన భూమిని పాలించెను.

(34-38) కోలాహలపురము నేలిన రాజులు 80 తరమువారు గతించగా ఆ వంశమందు వీరసింహుడనే రాజుపుట్టెను. సేనలచలనముచేత చోళదేశస్థులను, కనుబొమ్మ ముడిచేత పాండ్యులను, హుంకారముచేత సప్తకొంకణపతులను, న్యక్కారముచేత కేరళదేశస్థులను, అంతర్గతమైన కోపముతో విఘూర్ణమానమైన శిరస్సుచేత కర్ణాటలాటేశ్వరులను, అడలగొట్టుచుండిన ఇతని (ఈవీరసింహుని) ఉన్మత్తకృపాణమును వీక్షించుటయందు రాజులలో ఎవరయినా ధైర్యమును పొందియుండిరా? ఈవీరసింహభూపతి తన భుజబలముచే భూమిని జయించి సత్కర్మలనే ఆయుధములనుతొడిగి స్వర్గమును జయించెను. [38-39] అతనికి కామార్ణవుడు, దానార్ణవుడు, గుణార్ణవుడు, మారసింహుడు, వజ్రహస్తుడు అనే పేళ్లుగల పుత్రులు ఆయిదుగురు పుట్టినారు. (39-41) కులో

ద్వహుడయిన కామార్ణవుడు అనూజుగల తన పినతండ్రి (ఆక్రమించుకొన్న) రాజ్యమును తీసుకోగల శక్తిగల వాడే అయినా దేశమును విడిచిపెట్టెనేకాని ధర్మమును విడిచిపెట్టలేదు. (40-41) అతడు తన నలుగురు తమ్ములతోను కలిసి, ఐరావతము ఎట్లు తనదంతములతో దైత్యులను చీల్చివేయునో అట్లే యుద్ధమందుత్సాహము గల రాజులను చీల్చివేస్తూ తూర్పుదిశకు పోయెను. (41-42) అక్కడను అతడు వన్యేభముల మదజలముల సమూహము చేత ఇనుమడించిన నిర్ఝరులుగలిగి ఆకాశమును రాస్తూ ఉన్న శృంగములుగల మహేంద్రగిరి నెక్కెను. [42-47] అక్కడ, సకలసురాసురసిద్ధ సాధ్యశ్రేష్ఠులయొక్క కిరీటకోట్ల రాపిడివల్ల విరాజిల్లు చరణపీఠమును గల గోకర్ణస్వామిని ఆరాధించి, అతని అనుగ్రహమువల్ల ప్రాప్తమైన తెల్లనిఛత్రము, చామరము, సామజధ్వజము, వృషభలాంఛనము, పింఛాంచితమైన బల్లెముల సముదాయము, మకరతోరణము, హుడుక్కము, కాహళము, శంఖము మొదలయిన రాజోచిత చిహ్నములతో సాక్షాత్తు మహేంద్రునివలెనే శోభిల్లి, మహేంద్రగిరి శిఖరమునుండిదిగి, యుధిష్ఠిరునివలెనే తనతమ్ములను నలుగురినీ వెంటబెట్టుకొని సమరముఖమున శబరాదిత్యునిచంపి, (ఆ) కామార్ణవుడు కళింగ(రాజ్య)మును తీసుకొనెను. (47-49) రాజులందరి పురములనుమించి, దేవేంద్రునిపురమును అపహసించిన దంతాపురము అనే నగరము అతనికి రాజధానియై ఉండెను. [49-51] అతడు దానార్ణవుడనే తనతమ్మునికంఠమున హారమువేసి [యువరాజుగాచేసి] గుణార్ణవునకు అంబవాడివిషయమున్ను, మారసింహునకు సోదామండలమున్ను వజ్రహస్తునకు కంటకవర్తనిన్ని ఇచ్చెను. (51) ఈవిధమున, క్రమముగా (అతడు) 36 సంవత్సరములు కళింగ (దేశ) మును పాలించెను. [51-58] శ్రీమంతులున్ను, అశేషముగా ప్రపంచమందు నుతి కెక్కిన విమలయశోవంతులున్ను, అతులమైన భుజకృపాణము చేత ఆకృష్టయైన విజయలక్ష్మిని కౌగలించుకొన్న ఉన్నతవక్షస్థలము గలవారున్ను, చరణతలకాంతి చే సంధ్యారాగమువలె సమస్తనరపతిశిరఃకదంబకములను అంతర్హితులగునట్లు చేసినవారున్ను, అనవరతము రాజ్యవినోదముచేత మహేంద్రుని అపహసించినవారున్ను, మహేంద్రగిరిశిఖరమందు ప్రతిష్ఠితుడై సమస్తభువన నిర్మాణమునకున్ను ముఖ్యమైన సూత్రధారుడుగాను; చరాచరప్రపంచమునకు గురువుగాను ఉన్న భగవంతుడగు గోకర్ణస్వామియొక్క ఆరాధనవల్ల లబ్ధమైన సమస్తమైన మనోరథములు గలవారున్ను, ఆత్రేయగోత్రమువారున్ను అయిన గంగులయొక్క వంశమును అలంకరించి, విక్రమము చేత విష్ణువవలెనే సకల మహీమండలమున్ను ఆక్రమించిన ఆకామార్ణవుని తమ్ముడు, దానార్ణవుడు 40 సంవత్సరములు రాజ్యమేలెను. [58-59] అతనికుమారుడయిన రెండవకామార్ణవుడు 50 సంవత్సరములు మహీమండలమును పరిపాలించెను. అతనికి స్వర్గమును తిరస్కరించిన పురముండెను. దానిపేరు నగరము. (50-62 అందు లింగాకృతినున్న ఈశ్వరునకు [ఆఈశ్వరుడు] మధూకవృక్షమునుండి పుట్టియుండుటచేత మధుకేశుడనే పేరు పెట్టి మేఘములవంటు (నంతయెత్తుగల) దేవాలయమును కట్టించెను. అందు ద్వారములపైనున్న విచిత్రపత్రలతికలనుగాని, చిత్రములయిన సౌధములనుగాని చూస్తూ అంబరవీధిని సంచరించేవారికి తమవిమానములయెడల అరుచి పుట్టకతప్పదు. [62-63] అతనికొడుకు రణార్ణవుడు 5 సంవత్సరములు భూమిని సంతోషపెట్టెను. [63-64] అతని కొడుకు రెండవవజ్రహస్తుడు 15 సంవత్సరములు భూమిని రక్షించెను. [64-65] అతని తమ్ముడు మూడవకామార్ణవుడు 19 సంవత్సరములు పృథివిని పోషించెను [65-68] అతని వర్ణిస్తూ శ్లోకము:—సోమాన్వయుడైన కామార్ణవుడున్ను సూర్యాన్వయుడైన రాఘవుడున్ను వైచిత్ర్యము, దృఢత, సౌష్ఠవము అనే మూడువిధములయిన ధనుఃకర్మలందున్ను సమానమయిన ధురమును పొందియుండిరి. [అయితే వారిద్దరిలోను] ఒకడు [కామార్ణవుడు] ఒక్కబాణముతో జిఘాంసువులయి [వచ్చి]న సప్తసుభటులనుకొట్టెను. మరియొకడు రాఘవుడు వనమందు అసంఖ్యగల [ఏడు] చెట్లను కొట్టెను. కాని [కామార్ణవుని] విశిష్టమైనకీర్తి ఎక్కువగా వ్యాపించినది. [68-69] అతనికొడుకు, గుణార్ణవుడు 27 సంవత్సరములు భూమిని తనవశము చేసుకొనెను [69-70] అతని కొడుకు పోతాంకుశుడు 15 సంవత్సరములు భూదేవిని నిస్సపత్నగా చేసిఏలెను. (70-71) తర్వాత, అతని సోదరుని కుమారుడు, కళింగలాంకుశుడు 12 సంవత్సరములు కళింగరాజ్యము నలంకరించెను. [71-72] పిమ్మట అతని

కినతండ్రి), గుండమరాజు, 7 సంవత్సరములు మహీమండలమునకు మండనమయ్యెను. (72-73) అతని తమ్ముడు నాలుగవ కామార్ణవుడు 25 సంవత్సరములు వసుంధరను అనుభవించెను. [73] వారిద్దరికన్నను చిన్నవాడు [తమ్ముడు] వినయాదిత్యుడు 3 సంవత్సరములు ధరిత్రిని పోషించెను. (73-75) తర్వాత, అతనిజ్యేష్ఠసోదరుడైన కామార్ణవుని కుమారుడు, నాలుగవ వజ్రహస్తుడు 35 సంవత్సరములు ఏనుగుల మదజలధారలతో భూమిని తడిపెను. (77-77) అతనిని వర్ణిస్తూ శ్లోకము:—కాళింగకాంతారములందు పుట్టి అతులమై అతిథులకు (వజ్రహస్తునిచేత) దత్తమైన ఏగజసహస్రము గండస్థలములనుండి స్రవిస్తూఉన్న మదముచేత దిక్కులను పరిమళింపజేసెనో, వాటి దంతములవలెనే తెల్లనయినటువంటిన్ని నిర్మలమైనకాంతి కలిగినటువంటిన్ని [వాటి మదమువలెనే పరిమళిస్తూ ఉన్నటువంటిన్ని వజ్రహస్తప్రభుకీర్తి ముల్లోకములకును వ్యాపించినది. [76] పిమ్మట, అతనికొడుకు, అయిదవకామార్ణవుడు ఆరుమాసములు అవని పాలించెను. [78-79] తర్వాత, అతనితమ్ముడు రెండవ గుండమరాజు 3 సంవత్సరములు ధరాధురంధరుడయ్యెను. (79-80) అతని సవతి తమ్ముడు, ఆరవ మధుకామార్ణవుడు 19 సంవత్సరములు ప్రజలకు నాధుడయ్యెను. (80-81 పిమ్మట, అతని కుమారుడు, వజ్రహస్తుడు 33 సంవత్సరములు పుడమి నేలెను. (81-86) అతనిని వర్ణిస్తూ శ్లోకములు:—ఏగంగకులోత్తముని కీర్తి చంద్రకాంతి వలెనే నిర్మలమయి, లోకాహ్లాదము సంపాదిస్తూ దిక్చక్రవాళము వ్యాపించగా దిగ్గజములకు మావటివాండ్లు మాటిమాటికి కుంభస్థలములనే పట్టణములయందు మిక్కిలిదట్టమయిన పంకపటలముగల సిందూరమును అలుముతూఉంటారో, గుణవంతుడయిన ఎవనియొక్క వక్షస్థలమందున్న ముఖపద్మమందున్న అనురాగము చేత లక్ష్మీసరస్వతులు అనుకూలముగా నివసించి ప్రకాశిస్తూ ఉన్నారో, త్రికలింగనాధుడయిన ఆవజ్రహస్తుడు శాక మరియొవడు భూమిపై పడుతూవుండే వజ్రమును నివారించుటకు సమర్థుడు 86-87 అతనికొడుకు రాజరాజు 8 సంవత్సరములు భూమిని పాలించెను. 87-89 అతనిని వర్ణిస్తూ శ్లోకములు: ఆరాజరాజు మొట్టమొదట ద్రవిళాహవోత్సవమందు జయలక్ష్మికి భర్తై, పిమ్మట చోడరాజు కూతురై విరాజిల్లిన రాజసుందరిని పెండ్లియాడెను. [89-91] పరిణామకాలము రాగానే అపరదిక్కువలె నున్న వేంగిని వెంటనే విడిచిపెట్టి చోడవ్యాజమనే మహాసముద్రమందు మునిగిపోవుటకు సిద్ధముగాఉండిన విజయాదిత్యుని ఆపన్నులకు పరమశరణమయిన రాజరాజు పశ్చిమదిశయందు చిరకాలము శ్రీమంతునిగా చేసెను. ఎంత విచిత్రము [91-94] అతని పెద్దకొడుకు, చోడగంగదేవు తన భుజపరాక్రమముయొక్క ఔర్జిత్యసారము గలవాని సత్యత్యాగములకు ముఖ్యమయిన యశశ్చంద్రికలచే లోకమును తెల్లగా చేసినవాడు వాక్కులకు అందని ప్రతాపము గలవాడు శుభచరిత్రముల నిధి భాగ్యసౌభాగ్యములరాశి భూమికి అధిపతి సమస్తశత్రువులకును మనోభంగమును కలిగించువాడు. (94-97) శక 999 లో సూర్యుడు కుంభమందుండగా, శుక్లపక్షమందు, తదియనాడు, శనివారమున, రేవతీనక్షత్రము రాగా, మిధునలగ్నమందు గంగవంశపద్మమునకు సూర్యుడున్ను, సద్గుణములకు నిధిన్ని అయిన చోడగంగు భూచక్రమును సంరక్షించుటకై రాజ్యాభిషిక్తుడయ్యెను. (97-99) గుర్రములనే మహాతరంగములచేత భయంకరమైనటువంటిన్ని, ఎక్కువగాను గొప్పవిగాను ఉన్న నాగేంద్రములనే మొసళ్ళచేత ఆకులమయినటువంటిదిన్ని, నానావిధములయిన శస్త్రములనే సర్పరాజ సమూదాయములచేత దట్టమయినటువంటిదిన్ని క్రోధమనే ప్రకాశమానమైన బడబాగ్ని గలిగినటువంటిదిన్ని అయిన శత్రుసేన అనే సముద్రమును బాహువులనే మహామందరముతో మథించి, లక్ష్మిని, కీర్తి అనే సుధను సమస్తమయిన విబుధులయొక్క ఆనందముకొరకు శార్ఙ్గివలెనే ఎవడు గ్రహించెనో; (99-102) శత్రువుల దర్పమును ఖండించినటువంటి ఎవరి వీరలక్ష్మి తన భుజదండయుగ్మముచే కలితయై రెండుస్తంభముల నడుమను కట్టబడ్డ ఆడయేనుగు సాదృశ్యమును పొందెనో, ఎవని పాదద్వయమును సమీపించి నమస్కరించిన రాజులతలలు వికసిస్తూ ఉన్న పద్మయుగమును అనుసరించే మధుపశ్రేణియొక్క సంపదను ధరించెనో; [102-104] మొట్టమొదట తూర్పుదిశయందు రాజ్యభ్రష్టుడైన ఉత్కలపతిని రాజ్యమందు మరల నిలబెట్టి, పిమ్మట పశ్చిమదిశయందు నిఘటి

తుడైన వేంగి రాజునుకూడా అట్లే నిలవబెట్టి వర్ధిల్లుతూ ఉన్న కీర్తివైభవముగల ఏ శ్రీగంగచూడామణి జయలక్ష్మి యొక్క తోరణస్తంభములవలె నున్న ఆ ఇద్దరి [రాజుల] యొక్క లక్ష్మినిన్ని భంధనమాలికను [మంగళతోరణము] కట్టేటట్టు కట్టెనో;

[104-109] అతడు శ్రీమదనంతవర్మ మహారాజు, రాజాధిరాజున్ను, రాజపరమేశ్వరుడున్ను, పరమభట్టారకుడున్ను, పరమమహేశ్వరుడున్ను, పరమవైష్ణవుడున్ను, పరమబ్రహ్మణ్యుడున్ను మాతాపితృపాదానుధ్యాయియున్ను అయిన ఆ శ్రీచోడగంగదేవుడు వరాహావర్తని విషయమందు నివాసులయి ఉన్న రాష్ట్రకూటప్రముఖులను (రట్టడముల పెద్దలను) సమస్తకుటుంబులను పిలిపించి, పురోహితామాత్యయువరాజసంధివిగ్రహిదౌవారిక ప్రముఖ పరిజన సమక్షమందు ఈ విధముగా ఆజ్ఞాపించెను;

"మీ అందరికి తెలియవలసిన దేమంటే:—

"(109-115) మీ [వరాహావర్తని] విషయమందున్న ఖోన్న గ్రామమును, దానికి ముండపటు గ్రామము గ్రాసంగా చేసి. నాలుగువైపులను ఏర్పడ్డ ఎల్లలనడుమను అవిచ్ఛిన్నమయిన దానిని సమస్తజలసహితంగా, పన్నులు మొదలయిన బాధలు ఏమీలేకుండాజేసి, ఆ చంద్రార్కంగా తన తలిదండ్రుల పుణ్యయశోభివృద్ధికొరకున్ను తన యశోభివృద్ధికొరకున్ను శక 1003 వర్షములుకాగా మీనమాసమందు బహుళపంచమీ ఆదివారమున యజనయాజనాధ్యయనాధ్యాపన దానప్రతిగ్రహ షట్కర్మ నిరతులయిన నానాగోత్రముల బ్రాహ్మణులకు 310 మందికి ధారాపూర్వకముగా నాపితామహులైన వజ్రహస్తదేవుడు దానము చేసియుండెను. 115-118 అక్కడ గారగ్రామమందు చేరి ఉన్న ముండపటు గ్రామమునకు ఉపాంతముగా తూలువు గ్రామమునుండి కొంతవిడదీసి, అష్టోత్తరాశీతి-88 పరిమితమయిన క్షేత్రమును ఖోన్నగ్రామనివాసులయిన బ్రాహ్మణులకు శక 1034 వర్షములుకాగా ఉత్తరాయణనిమిత్తమున ధారాపూర్వకముగా మేము దానము చేసినాము అని" [118-18] ఉపాంతముతో కలిసిన ఈ క్షేత్రమునకు ఎల్లలు:—తూర్పున, ఖోన్న-ఓంబరవిల్లి-తోనెంగి గ్రామముల మూడింటికిని నడుమనున్న తోనెంగిగ్రామపు పుంత. ఆగ్నేయమందు పుట్టతో కలిసి ఉన్న మరిచ వృక్షము; దానికి పడమటవైపున కొంచెము వంకరగాపోతే, మరిచ వృక్షపంక్తి. దాని ప్రక్కను ఖోన్న-తోనెంగి-ఖోల్లిరగ్రామముల మూడింటికిని నడుమనుపుట్టతో కలిసిఉన్న మరిచ వృక్షము. దక్షిణమందు పెద్దపుట్ట; దాని తర్వాత అడవులపంక్తులు, దానిప్రక్కనున్న పుంత దాటితే. స్థాపితమై ఉన్నరాయి; దానితర్వాత వరుసగా స్థాపించిన రాళ్లు మూడు. నైరృతిని, స్థాపితమై ఉన్న రాయి; దానికి ఉత్తరమున స్థాపితమైనరాయి; దాని తర్వాత ఈ (ర?)ణిదల సేతువు క్రిందను చింతచెట్టు సమీపమున స్థాపితమయినరాయి; దాని ప్రక్కను తటాకమునకు చేరిన పుంత ముఖము; దానిప్రక్కను పుంతఒడ్డున స్థాపితమయినరాయి; అక్కడనుండి పుంతేసరిహద్దు. వాయవ్యమందు రెండు పుంతల నడుమను చింతచెట్టు సమీపమున స్థాపితమైనరాయి; అక్కడనుండి పుంతను అనుసరించి తూర్పువైపు కొంచెము వంకరగాపోయి ఆపుంతదాటి ఉత్తరమువైపు పోతే ఖోన్న-తూలువుగారగ్రామముల సంధియందు రెండుపుంతల నడుమను స్థాపితమైనరాయి. ఉత్తరదిక్కున రెండుతటాకములకు నడుమనున్నగట్టు. ఈశాన్యమందు ఖోన్న-గార-ఓంబరవేల్లి గ్రామముల మూడింటికిని తోనెంగి పుంతఒడ్డున మయ్యిలసంధి.

[137-136] దీనికి [ఈదానమునకు] ఎవరివల్లనూ బాధకలుగకూడదు. వ్యాసభగవానులు ఈవిధముగా చెప్పినారు:—"సగరాదిరాజులు అనేకులు భూదానము చేసినారు. భూమి ఏయేకాలములందు ఎవరెవరి వశమయి ఉంటుందో ఆయాకాలములందు వారివారికి తత్ఫలము లభ్యమవుతూ ఉంటుంది. యుధిష్ఠిరా! స్వదత్తమైనా పరదత్తమైనా భూమిని జాగ్రత్తగా రక్షించుము. మహానుభావులలో శ్రేష్ఠుడా! దానము చేయుటకన్నను పాలించడము [దానముచేసినది రక్షించడము] ఎక్కువ శ్రేయమయినది. ఒక ఆవునుగాని, ఒక బంగారునాణెమునుగాని భూమిలో ఒక అంగుళముగాని హరించినవాడు ప్రళయమున్నంతకాలము నరకములోపడి ఉండును. స్వదత్తమయినా పరదత్తమయినా భూమిని ఎవడుహరించునో వాడు అరవైవేల సంవత్సరములు క్రిమిజన్మమెత్తి యుండును. అని

[136-138] కావ్యకర్త శాసనాధికారి జాతవేదిభట్టు లేఖకుడు వల్లెనాచార్యునికుమారుడు, బట్టెనాచార్యుడు.

[[క్రోధన సం॥ భారతినుండి]

## 16 దేవేంద్రవర్మ కంబకాయశాసనము.

మ రా శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు

ఈశాసనమున మూడు రాగిరేకులు కలవు. మొదటి రేకు మొదటిప్రక్కను, మూడవరేకు రెండవప్రక్కను వ్రాతయేదియు లేదు. ఒక కడియము మూలమున ఈరేకులు బంధింపబడియున్నవి. కడియము యొక్క వ్యాసము 1-9 అంగుళములు. ఈకడియ మొక రాజముద్రికలో నతికింపబడియున్నది ముద్రికమీద స్ఫుటముగ ఎగువభాగమున చంద్రుడును, దిగువభాగమున అంకుశమును, ఈరెంటికి నడుమ అడ్డముగ మత్స్యమును చెక్కబడియున్నది. దీని ననుసరించి ఈశాసనమునందు చెప్పబడ్డ దాతవంశమువారిది మత్స్యలాంఛనమని తెలియునగును.

ఈశాసనమునందలి లిపి నాగరి; కాని యిది 'మూడవవజ్రహస్తుని చికాకోలవలస, 'బోడ్డపాడు, అనంతవర్మచోడగంగదేవుని కొన్ని శాసనములలోని లిపివలె తీర్చిదిద్ది వ్రాసినది కాదు. ఇది మూడవ వజ్రహస్తుని నడగాం నరసీపట్నం, మెడ్రాస్ మ్యూజియమ్ తామ్రశాసనములందలి లిపివంటిది. విచిత్రమైనది. విలక్షణమైనది. అక్షరములు పొంకముగ నుండక కొంకిరిగీతలవలె నుండును.

భాష సంస్కృతము. భాషయు వ్రాతయుకూడ చాలపాడుగా నున్నది. శాసనభాషలో ప్రాకృతఛాయ మెండు. దీని ననుసరించి ప్రాయికముగ లేఖకుడు ఉత్కలదేశనివాసుడై యుండునని యూహింపదగును. శాసనమున ఉత్కీర్ణకుని పేరుగాని, లేఖకుని పేరు కాని తెలుపబడియుండలేదు. శాసనభాషయు వ్రాతయు తప్పుల తడికగ నుండుటచేత శాసనమునందు చెప్పబడ్డ విషయములకు అన్వయక్రమము కొన్నికొన్ని సందర్భముల గనబడుట లేదు. అయినను నేనర్థము చేసికొన్న ప్రకారము శాసనవిషయమిది. కళింగనగరము రాజధానిగా పరిపాలించుచుండిన గంగామలకులతిలకుడగు శ్రీదేవేంద్రవర్మ 'దంతిపురము'న నుండగా ఆరాజుయొక్క విజయరాజ్యము 'సకాబ్దసహస్ర మేకసప్తత్యధిక'మని చెప్పబడ్డకాలమున ఆరాజుయొక్క మహామండలికుడును, కదంబకులతిలకుడును అగు శ్రీధర్మఖేడి పుత్రుడు మహామండలికుడైన ఉదయాదిత్యుడు 'రేవెనిజ' గ్రామమును 'అచాటభట' ప్రవేశ్యముగను, 'ఆచంద్రార్కస్థాయి'గాను ఉదకపూర్వముగ దానముచేసి అందొకభాగమును వృద్ధపుత్రుడైన సేవననాయకుని కుమారుడు నారాయణనాయకునికిని, ఇంకొక భాగము 'అయితము సోమయాదు [?] "ఈజన'కునికి నొసంగెను. ఇది యే శాసనభాషనుబట్టి నేనర్థము చేసికో గలిగినవిషయము.

దానమును గురించి చెప్పబడిన పిదప దానమొసంగిన గ్రామమునకు సరిహద్దులు చెప్పబడెను.

---

### మూలము.

మొదటి రేకు: రెండవ పెడ.



మొదటి రేకు; రెండవ పేడ

1 స్వస్తి అమరపురానుకారిణ సర్వర్తు సుఖ రమణీయా

2 త్ సుధాధవలప్రాసాద మాలావిరచితాలోకాత్

3 దోర్దణ్డ ఖణ్డిత సుబలాలంకృత శ్రీకలింగనగరా

4 ధివాసకాత్ మహేంద్రాచలామలకశిఖరప్రతిష్ఠి

5 తస్య సచరాచరగురోః సకలభువన నిర్మాణై

6 క సూత్రధారస్య శశాంకచూడామణే ర్భగవ తో గోకర్ణస్వా

7 మిన శ్చరణ కమలయుగళ ప్రణామా ద్విగత కలికలంకో ఉనే

8 కాహవ సంక్షోభ జనిత జయశబ్దః ప్రతాపావ నత స

రెండవ రేకు; మొదటి పేడ.



9 మస్త సామంతచక్ర చూడామణి ప్రభా మంజ రీ పుంజ రం

10 జిత నిజ నిస్త్రింశ ధారోపార్జిత సకల కళింగా ధిరాజ్యః దువార్ణ వైరివా

11 రణకుంభస్థల దలదళిత మౌక్తిక ప్రకరః ధ్వ స్తారాతిపు

12 లాచలో నయవినయ దయాదానదాక్షిణ్య శౌ ర్యాదాయకా

13 సత్య త్యాగ ప్రకర గుణ సంపదాధారభూతః పరమ మా

14 హేశ్వరః పరమ భట్టారకః గంగామలకుల తి లకః శ్రీదే

15 వేంద్రవర్మా విజయరాజ్యస్య శకాబ్ద సహస్రే ఏకశతత్రి

16 ధికే దంతిపురే స్థితః తస్య మణ్డలికః కదంబ కులతి

## రెండవ రేకు: రెండవ వైపు



17 లకః మహామణ్డలికః శ్రీధర్మఖేడీ. తస్య పుత్రః మహా

18 మాణ్డలికః శ్రీఉదయాదిత్యః కుశలీ పఞ్చపాత్రివిషయనివాసినో జనపదాన్సమాహూయే త్థమాజ్ఞాపయతివిది

19 తమస్తు ;భవతా, పఞ్చవిషయే; రేవనిజిగ్రామ ఉదకపూర్వకం కృ

21 త్వా తా మ్రశాసనీకృత్య వృద్ధపుత్రరేవన నాయకస్య పుత్రాయ

21 నారాయణాయైకభాగం ఆఇతయ సోమయాదు(?)

22 ఈజణ శా యైకభాగం కృత్వా ప్రదత్తో స్మాభి రచాట భట ప్రవేశ్య మా

23 చంద్రార్కక్షితిసమకాలమ్, అస్యగ్రామస్య సీమాలింగాని లిఖ్యంతే, ఈశాన్యతః త్రికూటే

24 రోపిత శిలా పూర్వతః రోపిత శిలా అగ్నేయతః

## మూడవ రేకు: మొదటివైపు



మూడవ రేకు, మొదటి పెడ.

25 చ త్రికూటే రోపిత శిలా॥ మధువృక్షతలే రోపిత శి

26 లా॥ దక్షిణతః పర్వతభూమితలే రోపితశిలా నై

27 ర్ఋత్యతః తేపురు [?] వృక్షతలే రోపిత శిలా॥ పశ్చిమతః 'జయతీ'

28 గర్తః వాయవ్యతః రోపితశిలా॥ ఉత్తరతః రోపిత

29 శిలా॥ రేఖి (?) గ్రామస్య మాడద్వయీ ౼ దత్తా॥ అపర

30 దోలీ॥ పడవేట॥ పడత్తర ప్రదతోస్మి॥

---

## 17 ధర్మఖేడి సింహపుర తామ్రశాసనము.

### మ॥ రా॥ శ్రీ రాళ్ళబండి సుబ్బారావుగారు

ఈ తామ్రశాసనమును ఇంగ్లీషున శ్రీ సత్యనారాయణ రాజగురువుగారు ఆంధ్రదేశీయేతిహాసపరిశోధకమండలి వారి త్రైమాసిక పత్రిక మూడవసంపుటము, రెండు, మూడు నాల్గు సంచికలలో ప్రకటించిరి. ఇది గంజాముజిల్లాలోని టెక్కలి సమీపముననున్న సంతబొమ్మాళి గ్రామమున దొరకినది.

ఈశాసనమున మూడు రేకులు గలవు. ఆందాఖరి రేకు రెండుప్రక్కలను వ్రాతఏమియులేదు. మొదటిరేకు, మొదటి పెడను "శ్రీ" యను యక్షరము తప్ప, ఇంకేవ్రాతయులేదు. రెండవ పెడను 9 పంక్తులు గలవు. ఇట్లే, రెండవరేకు మొదటి పెడను, రెండవ పెడనుగూడ 9 పంక్తులు చొ॥ గలవు. ఒకొక్కరేకు కొలత 6¾x3 1/8x1/5 రేకులను బంధించిన కడియము, అరంగుళము దళసరిని 11 న్నర అంగుళములు చుట్టుకొలత గలిగియున్నది, కడియపు కొసలు రాజముద్రికయం దమర్చబడినవి. రాజముద్రికపైనుండు చిహ్నము గానరాదు:

శాసనపు లిపి, కుటిలాక్షరములకు చెందినదై 10 11, శతాబ్దముల నాటి తూర్పుగాంగుల శాసనపు లిపిని, పోలియున్నది. గనుక ఈ శాసనము 11 శతాబ్దపు ప్రారంభకాలము నాటిదని తోచుచున్నది. శాసనపు భాష సంస్కృతము, శాసనమంతయు గద్యాత్మకము. వ్యాసగీతములున్న శాసనపు ఆజ్ఞప్తి, లేఖరిపేర్లున్న ఇందుగానరావు. ఇవిమూడవరేకు మొదటిపెడను వ్రాయబడవలసియుండెను.

కదంబకుల వంశీయుడును, పంచవిషయమండలికుడును, మహేంద్రాధిపతియును, అగు ధర్మఖేడి ధర్మపుర గ్రామమును 300 బ్రాహ్మణులకు అగ్రహారముగా చేసి. ఇచ్చెను. ధర్మపురగ్రామములోని రెండుభాగములు, వత్స గోత్రీయులగునట్టి ఇద్దరుసోదరులకు ఇవ్వబడెను.

సకల కళింగాధిరాజున్ను, రాజపరమేశ్వరుడున్ను, పరమభట్టారకుడున్ను, గంగామలకులతిలకుడున్ను, అగు శ్రీమదనంతబ్రహ్మ(వర్మ?)మహారాజుకొడుకగు శ్రీమద్దేవేంద్రబ్రహ్మవర్మ రాజ్య మేలుచుండిన కాలమున, కదంబవంశ ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరము 520 న జయంతిపుర నివాసియు, పంచవిషయమణ్డలేశ్వరుడును, శ్రీమహేంద్రాధిపతియు, కదంబకులవంశోద్భవుడును, అనేకయుద్ధములందు శత్రువులను ఖండించిన చక్రముగలవాడును, మహామణ్డలేశ్వరుడును అగు రాణక శ్రీనియార్ణవుని కొడుకగు రాణక శ్రీభీమఖేడి కొడుకు రాణక శ్రీధర్మఖేడి ఈదానమును చేసెను.

గాంగకదంబవంశ ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరమని చెప్పబడుటచేతను, గంగామలకులతిలకుడగు అనంతవర్మకొడుకు దేవేంద్రవర్మ రాజ్యము చేయుకాలమున కదంబవంశీయుడగు ధర్మఖేడి మండలికుడుగా నున్నట్లు తెలుపబడియుండుటచేతను, కదంబులు గాంగరాజులకు సంబంధించినవారనియు, సామంతులనియు, కళింగములోని కొన్ని విషయముల నేలుచుండిరనియు, తెలియుచున్నది,

## మూలము.

### మొదటి రేకు; రెండవ పెడ.



1 ఓంస్వస్తి అమరపురానుకారిణః సర్వేభ్యః సుఖ రమణీయా

2 త్ సుధాధవలప్రాసాద మాలావిరతలాలితలాస్యా త్ దోర్దండప

3 ణ్డిత సకలాలంకృత శ్రీకలింగనగరాధివాసకాత్ మహేన్ద్రాచ

4 లామలకనక శిఖరప్రతిష్ఠి తస్య సచరాచర గురోః సక

5 ల భువన నిర్మాణైక సూత్రధారస్య శశాంక చూడామణేర్భగ

6 వతో గోకర్ణ్ణస్వామినః చరణకమలయుగల ప్రణామా

7 ద్విగతకలికలంకానేకాహవ సంక్షోభ జనిత జయః శ

8 బ్దః ప్రతాపావనత సమస్తసామంత చక్ర చూడామణి ప్రభామంజ

9 రీ పుంజరంజితవరచరణః నిజః స్త్రింశధారో పా ర్జిత సకల

### రెండవ రేకు: మొదటి పెడ



## రెండవ రేకు; మొదటి పెడ

10 కలింగాధిరాజపరమేశ్వర పరమభట్టారక గం
గామల కులతిల

11 క శ్రీమదనంతబ్రహ్మమహారాజసుతః శ్రీమద్దే
వేన్ద్రబ్రహ్మ రాజ్యా

12 వకాలే గంగాకదంబవంశప్రవర్ధమాన విజయ
రాజ్య సంవత్సరపంచ

13 శతవింశోత్తరే జయంత్యాపుర వాసినః పంచ
విషయ మణ్డలేశ్వర శ్రీ

14 మహేన్ద్రాధిపతి కదంబకుల వంశోద్భవా నేక
తూర్యారావోం తారిసి

15 తారాతిచక్రః మహామణ్డలేశ్వర రాణక శ్రీ
నియార్ణవస్య

16 సుతః రాణక శ్రీభీమఖేడిః తస్యసుతః రాణకధర్మఖే

17 డిః పాదాగ్రా ప్రకృతిరమాత్య పంచపాత్ర
రాజపాదోప జీవినః

18 బ్రాహ్మణపురోహవర సామబాజీరట్టకూట విష
యాప్రధానస్య

## రెండవ రేకు; రెండవ పెడ.



19 సమస్త జన పదాదీనాం యథార్హతి మానయతి
బోధయతి సమా

20 జ్ఞాపయతి విదితమస్తు భవతాం మహేన్ద్ర భోగ
విషయేధ

21 ర్మపురచతుస్సీమావచ్ఛిన్నసజలస్థల విటపా
రణ్య త్రు

22 ణీ శతబ్రాహ్మణ స్థాన అగ్రహార కృతోహం
పాలివన

23 దనపురవినిర్గతా తుణిశతబ్రాహ్మణాయప్రముఖ

24 వత్సగోత్రీద్వయభ్రాత్రు నానా వివేద్దం నా
స్తి దాదానాయక

25 సుతః నాయక దుదురావలకం సాబునాయక
సుతః నాయ

26 క చామణ్డక బ్రహ్మాదబెణ్ణధడతూర్య భేరి
ఖాహాళతలీ తా

27 మ్రాన్వాందోలిచ్ఛత్ర ఏతదపరిపతిపత్తిం సహ
ఉదక పూర్వకే॥

———

## 18. ఇంద్రవర్మదేవుని తామ్రశాసనము.

మ॥రా॥శ్రీ రాళ్లబండి సుబ్బారావు గారు

ఈ శాసనపు ప్రతిబింబములు మదరాసు వస్తుప్రదర్శనశాలాధికారులు 1927సం॥లో, ఆంధ్ర దేశీయేతిహాసపరిశోధకమండలి త్రైమాసికపత్రికలో ప్రకటనార్థము కోరగా పంపిరి. ఇందునుగూర్చి ఆంగ్లవ్యాసమును త్రైమాసిక పత్రిక మూడవసంపుటము, రెండు, మూడు, నాల్గు, సంచికలలో ప్రకటించితిని. దీనినే తెలుగున ఇందు పొందుపరచడమైనది.

ఈశాసనమును గురించి 1917-1918 Epigraphical Report లో సంక్షిప్తముగా శాసనాధికారులు వ్రాసిరి. కాని ప్రతిబింబములుగాని, పాఠములు గాని, శాసనపుచరిత్ర గాని ఇవ్వబడలేదు.

ఈ శాసనమున మూడు రేకులు గలవు. ఒక్కొక్కటి 7"x3½" కొలత గలిగియున్నది. రేకులను బంధించిన కడియపు కొనలు రాజముద్రికయందమర్చబడినవి. ఆముద్రికపైని కూర్చుండియున్న నందివిగ్రహమున్ను, అర్ధచంద్రాకారమున్ను చెక్కబడినవి. శాసనపు రేకులలో మొదటిదాని మొదటి పెడను, మూడవదాని రెండవ పెడను, వ్రాతయేమియు లేదు. మొదటి రేకు రెండవ పెడను, రెండు, మూడవ రేకుల మొదటి పెడలను, తొమ్మిదేసి పంక్తుల చొప్పున గలవు. రెండవ రేకు రెండవ పెడను 8 పంక్తులు మాత్రమే గలవు. మొత్తముమీద శాసనమున 35 పంక్తులు గలవు.

శాసనపుభాష సంస్కృతము. లిపి ప్రాచీన నాగరి. అక్షరముల పోలికను బట్టి, శాసనము క్రీ॥ శ॥ 12వశతాబ్దమునాటిదని చెప్పవచ్చును.

శ్వేతకాధిష్ఠానవాసియు, మహేంద్రాచల గోకర్ణేశ్వరుని పాదభక్తుడును, సకల కళింగాధిరాజున్ను, పరమమాహేశ్వరుడున్ను, మాతాపితృపాదానుధ్యాతయు, అగునట్టి మహారాజశ్రీ ఇంద్రవర్మ దేవుడు జలమ్బూర విషయములోని ఉద్యోగస్తుల నందరిని పిలిపించి వారి ఎదుట ఆ విషయము నందలి అమేరసింగగ్రామమును, జాతుకర్ణస గోత్రికుండును, వాజసనేయచరణ, కాణ్వశాఖీయుండును అయిన చండస్వామియను బ్రాహ్మణునకు తనయొక్కయశో పుణ్యాభివృద్ధి కొఱకై దానముచేసెను. వ్యాసగీతములు వ్రాయబడినవి. శాసనమును మహాసామంతుడగు శ్రీనాగఖేడియు, మహాప్రతిహారుడగు ఆదిత్యవర్మయు, వ్రాయించిరి. మహాసంధివిగ్రహికుడగు ఛందపాక వ్రాసెను. కంచరి యగు దేవపిలానుడు చెక్కెను.

### మూలము.

మొదటి రేకు: రెండవ పెడ



మొదటి రేకు; రెండవ వెడ

1 ఓంస్వస్తి శ్వేతకాధిష్టానాత్రభగవత్త్శ్చరాచరసక

2 లశశాంక శేఖరవరస్య స్థిత్యుత్పతిప్రళయ కార

3 ణహేతో మహేన్ద్రాచ(ల) శిఖరనివాసి శ్రీ

మాంగోకర్ణేశ్వరభ

4 ట్టారకస్యచరణ కమలారాధనా వ్యాప్త పుణ్యాని

చయశక్తి త్రి

5 య ప్రభానురన్జితాశేష సామన్తచక్రస్య భుజబల

6 పరాక్రాన్త సకలకలిజ్గాధిరాజ్యో పరమ

మాహేశ్వరో మాతా

7 పితృపాదానుధ్యాతో మహారాజో శ్రీఇంద్రవర్మ

దేవ కుశలీ.

8 జలమ్బోరవిషయే యథాకాలాధ్యాసి మహా

సామన్త శ్రీ

9 సామన్త రాజానక రాజపుత్రి కుమారామాత్యా

పరిక దణ్డ

రెండవ రేకు; మొదటి వెడ.



10 నాయక విషయపతి గ్రామపతిబ్రాహ్మపురో గ్రామాన

11 త్యాక్షచాట భటచండపాశా బలభ జా తి

ర్యాం యధారర్హామా

12 నయతిబోధయతి చ సమాదిశతి విదిత మస్తూ

భయతాం ఏ

13 తద్విషయ సంబంధ అమేరశింగ గ్రామే భూమి

పూర్వదిశోపా

14 ప్కరిన్యాపశ్చిమపాలిపరిశ్చేదానదిపావత్ పశ్చిమ

15 ప్రదేశాదృక్ఛోగికస్యాభోగపాటకపరిశ్చేదా త్త

16 తప్రదేశాభిష్టపరిశ్చేదాదక్షిణదిశాయాంనదీపరిశ్చే

17 దనదీశాంపాణీ అర్ధభోగా ద్వాజసేనచ(ర)ణా

య కణ్మశా

18 ఖాయ జాతుకర్ణగోత్రాయ వశిష్ఠాత్రి

జాతుకర్ణేతి ప్రవ

రెండవ రేకు: రెండవ వైపు



19 రాయాజాతుకర్ణాద్భట్టజాయజేష్టాయఅత్రిప్రవరాయ

20 భట్టపుత్రజన్న స్వామిశర్మణె మాతాపిత్రో

రాత్మనశ్చ

21 పుణ్యాభివృద్ధయే సలిలధారాపురస్సరేణా చం

ద్రార్కం

22 తి సమకాలేః మకరీకృత్వా ప్రతిపాదిస్మాభి

యతశ్శాన

23 సదర్శనాద్ధర్మగౌరవాస్మద్గారవాచ నకేనచి

24 త్పరిపంధిభవితవ్యం తథాచ పఠ్యతి ధర్మశాస్త్రే

బహుభి

25 ర్వసుధాదత్తారాజానసగరాదిభిః యస్యయస్య

యధాభూమి

26 తస్యతస్య తదాఫలం స్వదత్తాం పరదత్తా

మ్వాయోహ

మూడవ రేకు, మొదటివైపు.



మూడవ రేకు: మొదటివెడ

27 రేణవమంధరాం సవిష్ఠాయాంక్రిమిర్ భూత్వాషిత్రుభి
28 సహవచ్యతే। మాభూదఫలశంకావ పరదత్తేతిపా
29 ర్థివా। స్వదానా త్పాలమానన్యం పరదత్తాను పాలనే ఇ
30 తి కమలదలాంబు బిందులోలాంశ్రిమను చి
31 న్త్యమనుశ్యజీధితాశ్చసకల మిదముదాహృ
32 తశ్చబుద్ధానహిపురుషైఃపరకీర్త యోధిలోప్యా దృత్తాసై
33 త్రమహాసామంతశ్రీనాగఖేడి మహాప్రతిహారఆది
34 త్యవర్మణాలేఖితశ్చమహాసన్ధి విగ్రిహిఖః
35 చాన్దపాకేనః ఉత్కీర్ణం కాజ్ఛాకరకో దేవపిలానేత్రిః

———

19. నరసింహదేవుని కెండుపట్న తామ్రశాసనం.

మ॥ రా॥శ్రీ॥ చిర్రావూరి ఆత్మారాంగారు. B.A.B.L.,

ఈ శాసనమును, నగేంద్రనాథ్ వాసుగారు బెంగాలు ఏషియాటిక్ మండలివారి పత్రికయందు (1896 సం॥ 229 పేజీ) ఇంగ్లీషున ప్రికటించిరి. అమండలి కార్యదర్శిగారి యనుమతితో శాసనముయొక్క మూలమును. అర్థమును ఇందు పొందుపరచడమైనది. ఈశాసనమున 7 రేకులు గలవు. కాని ఆఖరిరేకు రెండుప్రక్కలను, మొదటిరేకు, మొదటిప్రక్కను, వ్రాతఏమియూలేదు. రేకులను బంధించిన కడియపుశిఖామీద పద్మాసనము, నంది, త్రిశూలము, అంకుశము, డమరు, అర్ధచంద్రుడు, సూర్యుడు ఈ విగ్రిహములు గలవు. వీటినిబట్టి శాసనపు దానకర్త చంద్రివంశమునకు చెందినవాడనియు, శివభక్తుడనియు తోచును.

రేకులు, 13¼ అంగుళములు పొడవున్ను, 8 ¾ అంగుళములు వెడల్పున్ను, 1/5 అంగుళము దళసరియున్ను గల్గియున్నవి. రేకులను బంధించిన కడియపుచుట్టుకొలత, 5 1/2 అంగుళములున్నది. కడియమునకంటియున్న రాజముద్రికయొక్క చుట్టుకొలత 4 1/2 అంగుళములున్నది. దానిపైని చెక్కబడిన నంది, 4 అంగుళములపొడవును, 3 1/2 అంగుళములయెత్తును గల్గియున్నది. మొత్తమువీద శాసనపురేకులలోని 11 ప్రిక్కలయందును 209 పంక్తులు గలవు.

ఉత్కళదేశాధీశుండును, గంగవంశీయుండువగు రెండవ నరసింహదేవుడు, ఈశాసనమున పేర్కొనబడిన ఏడర, లేక, ఏణ్డరగ్రామమును, సుసైలగ్రామమును తన 21వ రాజ్యసంవత్సరమున, అనగా క్రీ॥శ॥ 1295 వ సంవత్సరమున భీమదేవశర్మయను బ్రాహ్మణునకు చంద్రిగ్రిహణకాలమున దానమిచ్చెను.

శాసనపులిపి, బెంగాలీభాషకు చేరిన కుటిలాక్షరములను పోలియున్నది. రెండవరేకు, రెండవప్రక్కను చెక్కబడిన యక్షరములుమాత్రిము ఉత్కళాక్షరములవలె నున్నవి. శాసనపుభాషయంతయు సంస్కృతమున గద్యపద్యాత్మకముగా నున్నది.

మూలము

———

మొదటి రేకు; రెండవ పెక.

ఓం నమో నారాయణాయ.

పంక్తి 1 లక్ష్మీపాదసరోరుహ [ద్వయ] మదః శ్రేయాంసి దానేష్టవః ప్రిస్ఫుర్జన్నఖరశ్మికేసరలతైర్నాభస్వన్న
2 చాలీనలం విస్పష్టం ప్రితిబిమ్బితః ప్రణమతైః క్రీడాపరాధోద్భవైః కృష్ణోయన్నఖదీప్తిషు భ్రమరతాం ధత్తే సలక్ష్మీప్రియః.
3 క్షీరాబ్ధేర్మథితాత్ సురాసురగణైః ప్రాదుర్భవన్తీరమా శమ్భుబ్రిహ్మపురన్దరప్రభృతిషు ప్రఖ్యాకీర్తిష్వపిప శ్యత్స్వప్యజనా,
4 భవిశ్ళ మప్యుణోల్లోకత్రియాహ్లాదినం భృంగాలీసహకారమేతిహివనే ఫుల్లేన్యశాఖిన్యపి, తన్నాభీసరసీరుహోద్భవవి
5 ధేః త్రిగ్భభూవామృత శ్చన్ద్రశ్చన్ద్రికయా ప్రికాశిత జగత్ సమ్భూతవాన్నేత్ర యోః త్రైలోక్య గ్రిసనైకదక్షతిమిరగ్రాసిత్వసా
6 మ్యేపియో లక్ష్మవ్యాజి దధత్త మప్రితి వపుః సూర్యాదికోనిర్మలః శ్రీదేవీసోదరత్వాద మృతసఖతయా కల్పవృక్షానుజ
7 త్వా ల్లోకానం ప్రిమ్వ ధాతా తిమిరవిహారః సర్వ్వ దైవోవ భోగ్యః తత్పుత్త్సంసర్గలాభాత్త దధిగతగుణం

